# ఉపోద్ఘాతము

శ్రీ వేంకటేశ్వరస్వామివారి దర్శనార్థము తిరుపతి పురమున కహోరాత్రములు లక్షలకొలది యాత్రికులు విచ్చేయుచుండుట జగద్విదితము.

ఈ యాత్రికులలో ననేకులు శ్రీవారికి చెల్లించుటకు విలువగల ముడుపుల దెచ్చువారును, అధిక ధనవ్యయమొనర్చి శ్రీవారి కుత్సవాదులు చేయించువారును గలరు.

వీరిలో ననేకు లీ తిరుమల తిరుపతి యాత్రయం దెచ్చట బస చేయుట కనుకూలమో, యే యే పుణ్యతీర్థముల స్నాన మొనరింపవలయునో, యే యే దేవాలయముల కేయే సమయములందేగి దర్శనము చేసుకొనవలయునో, యెట్లు యెచ్చట తమ కానుకల చెల్లించి తాము కోరిన యుత్సవాదుల శ్రీవారికి చేయించవలయునో, దేవస్థానాధికారు లీ యాత్రికులకొఱకై లక్షలకొలది ద్రవ్యము వ్యయపఱచి యొనరించియుండు సౌకర్యముల నెట్లనుభవించవలయునో, స్వాలాభాపేక్షచే శ్రీవారికి చేరవలసిన ద్రవ్యముల నాకర్షింపనెంచి తమ వెంట దిరుగుచుండు డళ్ళాలీలు మొదలగు వారి వలననుండి తప్పించుకొని భగవంతుని కెట్లు తమ ప్రార్థనల జెల్లించి కృతార్థులు గావలయునో యను విషయము లేవియు తెలియక కష్టపడుచున్నారు.

యాత్రికులు తిరుపతిలో నడుగిడినది మొదలు తిరిగి పోవువరకును వారెట్లు ప్రవర్తించినయెడల బహు సులభముగా కృతకృత్యులగుదురో అట్టి సంగతుల నద్దమువలె ప్రదర్శించుటకై యీ గ్రంథము వ్రాయడమైనది.

యాత్రికు లిందలి యంశముల గమనించి శ్రీవారి దివ్యదర్శనంబుచే సంప్రాప్తసకలకాములై సుఖింతురు గాక!



# తిరుమల తిరుపతి యాత్ర

## విషయసూచిక



## మూడవ అధ్యాయము



### తిరుమలలో యాత్రికులకుగాను దేవస్థానమువారు గావించిన యేర్పాట్లు



## నాల్గవ అధ్యాయము

## అయిదవ అధ్యాయము

## ఆరవ అధ్యాయము

## ఏడవ అధ్యాయము



## ఎనిమిదవ అధ్యాయము

## తొమ్మిదవ అధ్యాయము



## కడపటి అధ్యాయము



శ్రీ వేంకటేశ్వర స్వామివారు

శ్రీ

# తిరుమల తిరుపతి యాత్ర

## అధ్యాయము 1

తిరుపతి:— ఇది చెన్నరాజధానిలో చేరిన చిత్తూరుజిల్లాలో నొక గొప్ప మునిసిపాలిటీ పట్టణము. ఇచ్చట తిరుపతి తూర్పు, తిరుపతి పడమర యను రెండు రైల్వేస్టేషను లున్నవి.

ఈ పుణ్యక్షేత్రమునకు వచ్చు యాత్రికులు తిరుపతి తూర్పునందే దిగవలయును.

తిరుపతియందు శ్రీ గోవిందరాజ స్వామివారి దేవాలయము, శ్రీ కోదండరామస్వామివారి దేవాలయము, అను రెండు ముఖ్య దేవస్థానములును, తిరుమల తిరుపతి దేవస్థానముల ఖచ్చేరియు (Head-Office), దేవస్థానపు ఖజానాయును (Devastanam Treasury), దేవస్థానపు హైస్కూలును, వేద పాఠశాలయు, సంస్కృత కాలేజియు, అనాథశరణాలయము (Orphanage), నూతనముగా 1939 సం॥ స్థాపింపబడిన ప్రాచ్యవిద్యా పరిశోధనాలయము (The Oriental Institute) నూతనముగా 1945 సం॥ స్థాపింపబడిన కళాశాల (Arts College) యు గలవు. తిరుపతికి ఉత్తరమున శ్రీ కపిలేశ్వరస్వామి దేవాలయమను శివాలయము గలదు. మఱియు తిరుపతికి యీశాన్యమున రెండుమైళ్ల సమీపములో అక్కారాంపల్లెవద్ద 'బీదలగృహము' (Poor Home) గలదు.

## దేవస్థాన సత్రములు మొదలగు సౌకర్యములు

శ్రీ వెంకటేశ్వరస్వామివారి దర్శనార్థము తిరుపతికివచ్చు యాత్రికులు దిగి నిశ్చింతతో తమ సామానులను జాగ్రతపఱచుకొని స్నాన భోజనాదికముల నిర్వర్తించుకొనుట కనుకూలముగా శ్రీ దేవస్థానము వారు క్రింద వివరింపబడిన కట్టడముల నిర్మించి వానిలో యాత్రికులు దిగుటకు వసతులన్నియు నేర్పఱచియున్నారు. ఉచితముగా తమ స్వంత గృహములవలె స్వేచ్ఛగా దిగి ఆ యా స్థలములందుండు నుద్యోగుల సహాయమువలన తాము తెచ్చిన వస్తువుల భద్రపఱచుకొని ఉచితముగా నొసగఁబడు పాత్రసామానులను తీసికొని భోజనాదులను జేసికొనవచ్చును. ఈ సత్రములందు యాత్రికులు ఒక్కొక్క పర్యాయము మూడురోజులకు మించకుండా బసచేయవచ్చును. యాత్రికులు కొండకు వెళ్లునపుడు గదుల ఖాళీచేసి తమ వస్తువులను "సామానుల అర" (Luggage Room) యందు భద్రపరచి రశీదు పొందవచ్చును. మరలవచ్చిన తర్వాత రశీదు వాపసుచేసి తమ వస్తువులు తీసికొనవచ్చును.

ఈ సందర్భమున యాత్రికులు ముఖ్యముగా గమనించవలసిన విషయ మొకటి గలదు. యాత్రికులు తిరుపతి స్టేషను చేరుటకు మునుపే యీ స్థలవాసు లనేకులు వారిని రైలులోనే సంధింతురు. తమ యిండ్లలో దిగవలయునని యాత్రికుల బ్రార్థింతురు. యాత్రికు లొసగు స్వల్ప ద్రవ్యములతో తృప్తిజెంది వారికి సకల సౌకర్యముల నొసగ గలమని వచింతురు గాని ఈ విషయములందు యాత్రికులే చక్కగా నాలోచించు కొనవలయును. యాత్రికులు శ్రీ వెంకటేశ్వరస్వామికిగాను తెచ్చు కానుకలు, ముడుపులు వగైరాల విషయమై స్వలాభాపేక్షతో సలహాలొసంగు డలాలీలు, కమీషన్ యేజంట్లు, పండాలు మొదలగు వారి మాటలను వినక తిరుపతి రైల్వేస్టేషనునకు ప్రతి బండికిని వచ్చు దేవస్థానపు పిల్‌గ్రిమ్

గైడులను (మార్గము చూపువారు) వారి యుడుపులపై ప్రదర్శింపబడు బిళ్ళలద్వారా గుర్తించుకొనవలయును. వీరు యాత్రికులను దేవస్థానపు కట్టడములకు పిలుచుకొనిపోయి దించి వారికి తగిన సౌకర్యము లొసగు చున్నారు. యాత్రికులీ యనుకూలముల గమనించి ప్రవర్తింతురుగాక.

దేవస్థాన ధర్మసత్రము :— ఇది తిరుపతి తూర్పు రైల్వే స్టేషనునకు యెదురుగా అతి సమీపమున నున్నది. ఇది సుమారు మూడు లక్షల యేబదివేల రూపాయలు ఖలవుచేసి కట్టబడిన గొప్ప సత్రము. ఇందు మొత్తము 125 గదులున్నవి. ప్రతి పెద్దగదియందును 20, 25 గురు యాత్రికుల పార్టీలు దిగుటకు అనువగు స్థలము, వంట గదులు గలవు. వీనిలో ముందుభాగమున నొక అరయు, మధ్యభాగమున విశాలమైన హాలును, వెనుక పార్శ్వమున సామాను అరయు వంట యిల్లును పాయఖానాదొడ్లు గలిగి యెలక్ట్రిక్ లైట్లు అన్ని గదులకు అమర్చబడియున్నవి. నీటివసతికై 3 బావులు, యంత్రగొట్టపుబావి (Bore well) కొళాయిలు, త్రాగుటకు మంచినీటితొట్లు వగైరాలు ఏర్పాటు చేయబడియున్నది. స్నానాదులకు కొళాయి లమర్చబడిన గదులున్నవి. వేడినీళ్లు కావలసినవారు టిక్కెట్టుకు రెండు అణాలు వంతున టిక్కెట్లుకొని స్నానము చేయవచ్చును.

ఈ సత్రములో తూర్పుపార్శ్వమున Extensions అను 72 అరలు రెండు వరుసలుగా కట్టబడివున్నవి. ఇందులో ఒక్కొక్కదానిలోను 5 లేక 6 మందిగల ఒక కుటుంబము బసచేయవచ్చును. ఈ గదులు ఎలక్ట్రిక్ లైట్లు, వంటగదులు పాయఖానా దొడ్లు, కలిగియున్నవి.

సత్రము మిద్దెపైనను ఆఱు అరలు గలవు. ఇవిగాక వెలుపల (Extensions) వైపు 10 గదులున్నవి. వీటికి సోఫా, కుర్చీలు మంచము యివి అమర్చబడియున్నవి. Electric Fan కూడా అమర్చ

బడియున్నది. ఈ అరలకుమాత్రము అర 1-కి ఒక దినమునకు (అనగా 24 గంటలకు మించని కాలపరిమితికి) రూ. 1_8_0 వంతున Furniture Fan వీటి నిమిత్తం అద్దె వసూలు చేయబడును.

ఇదియునుగాక యీ సత్రములో యాత్రికుల సౌకర్యార్థము, తపాలా ఆఫీసు, రయిల్వే బుకింగ్ ఆఫీసు, ధర్మ వైద్యశాల, వంట చెఱకుల డిపో, రేషన్ షాపు, పలసరకుల స్టోరు, కాయగూరల దుకాణము, బొమ్మలు, పాత్రలు, సోడా వగైరాలు, (Laundry), బట్టలు శుభ్రపరచియిచ్చుటకు చాకలి యివికూడా ఏర్పాటుచేయబడియున్నవి. ధర్మ వైద్యశాలలో ప్రయాణమున జబ్బుబడిన యాత్రికులకు మందులు ఉచితముగా యివ్వబడును.

ఇచ్చట దిగువారికి వంటకై పాత్రసామానులు ఉచితముగా నొసగబడును. వంటసామగ్రులు యాత్రికులకు అందుబడిగా నుండుటకై యీ సత్రమునందే అంగళ్ళున్నవి. వంట చేసుకొనజాలని వారి కనుకూలముగా నిందులోనే యొక హోటలున్నది. యాత్రికుల సౌకర్యార్థం ఉచితపఠనమందిరము (FreeReading Room) యిచ్చట వున్నది. నిత్యవార్తాపత్రికలు చదువుటకు, దేవస్థాన ప్రచురణ గ్రంథములు చదువుటకు మఱియు కొనుటకు లభించును.

ఈ సత్రములో యాత్రికులకు కావలసిన సమస్త విషయముల నడిగి తెలుసుకొనుటకొక యెంక్వైరీ (Enquiry Office) ఆఫీసుగలదు. వీరు యాత్రికులు అడుగు ప్రశ్నల కన్నిటికిని వివరముగా బదులొసగి తోడ్పడుదురు. యిదిగాక అచ్చు ఆఫీసుకూడా ఒకటి కలదు.

యాత్రికులు వీరి నడిగి దేవస్థానమునకు సంబంధించిన అన్ని సంగతులు, అనగా పూజా క్రమములు, దర్శన సమయములు, సాధారణోత్స

వములు, ఆర్జితములు, అనగా యాత్రికులు దేవస్థానములో పైకము కట్టి శ్రీవారికి చేయించదలంచియుండు ఉత్సవములు, నైవేద్యములు, సేవలు, వీనికి యేర్పడియుండు రేట్లు మొదలగువానినన్నియు తెలుసుకొనవచ్చును.

యాత్రికులు సులభముగా రైల్వేటికెట్టు కొనుటకై యీ సత్రము నందే యొక రైల్వే బుక్కింగు ఆఫీసు, తపాలాద్వారా ఉత్తరములు వగైరాలు పంపుటకు, పుచ్చుకొనుటకు సౌకర్యముగా పోస్టు ఆఫీసు పెట్టియున్నారు.

పుష్పతోట సత్రము :— తిరుపతి తూర్పు రైల్వేస్టేషను వద్ద కట్టియుండు దేవస్థానపు గొప్ప నూతన ధర్మసత్రముగాక నగరమధ్యమున పోలీసుస్టేషను సమీపమున శ్రీ కోదండరామస్వామి దేవాలయమున కెదుట ఉచితముగా యాత్రికులు దిగుటకై యేర్పాటు చేయబడియుండు పుష్పతోట యను మఱియొక దేవస్థానపు ధర్మసత్రము కలదు.

దీనిలో 38 అరలు యెలక్ట్రిక్ లైట్లు నీటివసతులు మొదలగు యావత్తు సౌకర్యము లున్నవి.

ఘోషాస్త్రీలు దిగుట కనుకూలమైన వసతు లిచ్చట గలవు.

ఇందుండు దేవస్థానపు టుద్యోగులు యాత్రికులకు పాత్రసామాను లుచితముగా నొసగి తోడ్పడుదురు. ఈ సత్రము మధ్యనుండు మంటపమునకు ప్రతి శనివారము సాయంకాలమున శ్రీకోదండరామస్వామి వారు వేంచేసి వారికి తోటయుత్సవము జరుపుదురు.

ఈసత్రముల యందలి సౌకర్యములు యాత్రికజనముల నధికముగా రంజిల్ల జేయుచున్న వనుటకు సందియములేదు.

కోమలమ్మ సత్రము: — ఇది అడివారమునకు పోవు దారిలో గవర్నమెంటు వైద్యశాలకు యెదుట వున్నది. ఇది దివాన్ బహాదూర్

విజయరాఘవులు శెట్టిగారి ధర్మము. ఇందులో యాత్రికులు బసచేసి యాత్ర జరుపవచ్చును.

శ్రీ వెంకటేశ్వరస్వామివారి దర్శనార్థము తిరుపతికివచ్చు యాత్రికులు ఈ యారోగ్యవంతములైన దేవస్థాన సత్రములందు దిగి తమ శరీరారోగ్యముల గమనించుకొని నెమ్మదితో శ్రీవారి దర్శనమునకై తిరుమలకుపోయి శ్రీ వెంకటేశ్వరస్వామివారి దర్శనము బొంది తిరుపతికి తిరిగివచ్చి తిరుపతిలో శ్రీగోవిందరాజస్వామి, శ్రీకోదండరామస్వామి దేవాలయములకు పోయి పిదప తిరుపతికి $2\frac{1}{2}$ మైళ్లలోనున్న చిరుతానూరికి (తిరుచానూరు, శ్రీశుకపురి) పోయి వెంకటేశ్వరస్వామి దేవియైన శ్రీ పద్మావతి అమ్మవార్లను (శ్రీ యలమేల్మంగతాయార్లను) దర్శనము చేసికొని పోవుదురు.

శ్రీ పద్మావతీదేవి దేవస్థానము :— తిరుపతికి మూడుమైళ్ళ దూరంలో వున్న తిరుచానూరులో యీ దేవాలయం వున్నది. 40 వేల రూపాయలు వెచ్చించి ప్రాకారంపైన బంగారు కళశములు తయారు చేయబడినవి. 20 వేల రూపాయలు ఖర్చుచేసి శ్రీ అమ్మవారికి అభయ హస్తములు తయారుచేయబడినవి.

యీ దేవస్థానంలో చెల్లించవలసిన రేట్ల వివరం :—

| | | | | |
|---|---|---|---|---|
| తుళశి అర్చన | ... | 0 | 12 | 0 |
| కుంకుమ అర్చన | ... | 0 | 12 | 0 |
| హారతి | ... | 0 | 4 | 0 |
| ఏనుగవాహనం | ... | 32 | 0 | 0 |
| గరుడవాహనం | ... | 40 | 0 | 0 |
| తిరుచ్చివుత్సవం | ... | 20 | 0 | 0 |
| తళిగ విత్తన | ... | 1 | 0 | 0 |

**తిరుపతి దేవాలయములు :—** తిరుపతి దక్షిణభాగమున రైల్వేస్టేషను సమీపమున శ్రీ గోవింద రాజస్వామివారి ఆలయమును ఉత్తరభాగమున శ్రీ కోదండరామస్వామివారి ఆలయమును తిరుపతికి బయటఉత్తరమున $1\frac{1}{2}$ మైళ్లలోనుండు శ్రీ కపిలేశ్వరస్వామివారి ఆలయమును గలవు.

ఇవన్నియు శ్రీ తిరుమల-తిరుపతి దేవస్థానములకు చేరినవి. వీనిలో శ్రీగోవిందరాజస్వామివారి ఆలయము యెక్కువ ప్రాముఖ్యము వహించియున్నది.

**శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయము :—** ఇది చాలా పురాతనమైన దేవాలయము. ఇందు రెండు గర్భగృహములున్నవి. మొదటిది గోపురద్వారములకు చక్కగానెదురుగానుండునది. ఇందులోనున్న శ్రీ పార్థసారథి విగ్రహము పూర్వమెప్పుడో భిన్నమైనందున యిది మూతవేయబడి దీనికి ఉత్తరమున ప్రస్తుతము పూజజరుగుచున్న గర్భగృహమందు క్రీ.శ. 13వ శతాబ్దమునకు ముందు శ్రీవైఖానసాగమరీతిని శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులగు శ్రీ మద్రామానుజాచార్యుల సంప్రదాయానుసారము శ్రీ గోవిందరాజస్వామివారు ప్రతిష్ఠింపబడిరి.

వీరు శేషశయనంబున పవ్వళించి దర్శనమొసగుచున్నారు. ఈ దేవాలయమునకు సంబంధించిన 15 చిన్నదేవాలయములున్నవి.

గర్భగృహమునకు ముందున్న మండపములును గోపురములును అప్పుడప్పుడు క్రీ. శ. 16-వ శతాబ్దమునకు ముందు కట్టబడినట్లేర్పడుచున్నది.

1935-1936 సంవత్సరములలో శ్రీ దేవస్థానపు కమిటీవారు రూ. 97,700 లు ఖర్చుచేసి శ్రీగోవిందరాజస్వామి వారికి బంగారు

ములాం ధ్వజస్తంభము ప్రతిష్ఠ చేయించి దేవాలయమును అధిక శోభాయమానముగా నొనరించిరి.

తిరుమలలో శ్రీ వెంకటేశ్వరస్వామి వారికి జరుగు రీతిగనే శ్రీ గోవిందరాజస్వామివారికి పూజలు, నైవేద్యములు, ఉత్సవములు మొదలగునవి జరుపబడుచున్నవి. ప్రతిసంవత్సరము వైశాఖమాసమున వీరికి బ్రహ్మోత్సవము అతివైభవముగా జరుగును.

ఇచ్చట యాత్రికులు అర్జితోత్సవనైవేద్యములు మొదలగు వానిని జరిపించుటకు శ్రీ తిరుమలయందు శ్రీ వెంకటేశ్వరుల దేవాలయములో అమలులోనుండు రేట్లప్రకారము రేట్లు యేర్పఱచబడి యున్నవి. సదరు గోవిందరాజస్వామివారి దేవస్థానములోనే యిన్స్పెక్టరు ఆఫీసులో చెల్లించి టిక్కెట్టు పొందినయెడల, వానిని జరిపింతురు.

శ్రీ గోవిందరాజస్వామివారి దర్శనమునకుగాను సొమ్ము చెల్లింప వలసినది లేదు. ఈ దేవస్థానములో యాత్రికులు చెల్లించు కానుక వగైరాలు శ్రీ వెంకటేశ్వరస్వామివారి దేవస్థాన ఖజానాకే చేరును.

**శ్రీ కోదండరామస్వామివారి ఆలయము:**—ఇది తిరుపతిలో నుత్తరభాగమున పుష్పతోట సత్రమున కెదుట నున్నది. క్రీ. శ. 15-వ శతాబ్దమున యీదేవాలయము నిర్మింపబడి శ్రీ రఘునాథస్వామి యను శ్రీ కోదండరామస్వామివారు ప్రతిష్ఠించబడిరి.

శ్రీకోదండరామస్వామి వరప్రసాదియని తిరుపతివాసులలో బహు సంఖ్యాకులు ప్రతి శనివారమును తప్పక వీరిదర్శనముచేసికొనుచున్నారు. వీరికి ప్రతిసంవత్సరము (ఫాల్గుణమాసము) పంగునినెలలో బ్రహ్మోత్సవము జరుగును.

ఈ దేవాలయములోని ఆర్జిత రేట్లు :—

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| 1. | తులసి అర్చన | 1 | 0 | 0 |
| 2. | కుంకుమ అర్చన | 1 | 0 | 0 |
| 3. | సహస్రనామ అర్చన | 5 | 0 | 0 |
| 4. | హనుమంత వాహనము | 32 | 0 | 0 |
| 5. | బంగారు గరుడవాహనము | 32 | 0 | 0 |
| 6. | హారతి | 0 | 8 | 0 |

**కపిలతీర్థము అనే శ్రీఆళ్వారుతీర్థము, శ్రీకపిలేశ్వరస్వామి దేవాయలము :—**తిరుపతికు త్తరమున 1½ మైలు దూరమున కొండ క్రింద నొకరమణీయమగు చిన్నకోనేరు గలదు. దీనిలోనికి వర్షకాలమున కొండలపై భాగమునుండి మెట్లు వరుసవలె నమరియుండు గుండములోబడి పైకెగయుచు చిత్రగతులతో వచ్చు ప్రవాహధార చూడదగినది.

దీనికి చుట్టుప్రక్కల చక్కని రాళ్లమెట్లును తూర్పున దక్షిణ పశ్చిమ భాగములందు సంధ్యావందన మండపములును దక్షిణభాగమున విశాలమగు ముఖమండపమునుగలవు. ఇవి క్రీ. శ. 1531 సంవత్సరమున శ్రీవిజయనగరాధిపతులగు అచ్యుతరాయల కైంకర్యములు.

ఈ తీర్థమునకు నాలుగుమూలలందు సుదర్శన చక్రములుగల శాసనపురాళ్లు నాటబడియున్నవి. ముఖమండపమునకు పైభాగమున బైట శ్రీనమ్మాళ్వారుల దేవాలయము కలదు. తీర్థముకకు తూర్పు భాగముననుండు సంధ్యావందనమండపమునకు పైభాగమున శ్రీకపిలేశ్వరస్వామి దేవాలయమున్నది.

శ్రీ తిరుమల-తిరుపతి దేవస్థాన పరిపాలనకు లోబడిన దేవాలయములపైకి యిదొక్కటియే శివాలయము,

ఈ తీర్థమునకు శ్రీ ఆళ్వారుతీర్థము శ్రీ కపిలతీర్థము అను నామంబులు గలవు. శ్రీ ఆళ్వారు అనగా శ్రీ సుదర్శన చక్రము.

యాత్రికులీతీర్థమున స్నానమొనర్చియే పిదప తిరుమలకు పోవుదురు.

శ్రీ కపిలేశ్వర దేవాలయములో అర్చనకు రూ. 0-4-0 లును హారతికి రూ. 0-1-3 లును అచ్చటనుండు నుద్యోగికి చెల్లించి చీటి పొందినయెడల నవి జరుగును.

యాత్రికు లనేకు లీ తీర్థమునందు స్నానమొనరించి శ్రీ కపిలేశ్వర స్వామివారి దర్శనము చేసుకొని అచ్చటనుండి తిరుమలకు పోవుదురు.

## శ్రీ కపిలతీర్థమాహాత్మ్యము, మాధవ చరిత్రము

పూర్వము శ్రీ కాళహస్తి నగరమందు మాధవుఁడను బ్రాహ్మణ యువకుఁడుండెను. అతడు వేదవేదాంగముల నెఱిఁగినవాఁడు. పూర్వకర్మవశంబున నా బ్రాహ్మణుఁడు తన జాతిధర్మముల వదలి కృష్ణాతీరమునకు పోయి పది సంవత్సరము లుండెను.

పిదప మాధవుఁడు తెలివి తెచ్చుకొని శ్రీ వెంకటేశ్వరుల దర్శించుకొనుటకుగాను తిరుపతికి వచ్చి శ్రీ కపిలతీర్థమున స్నానముఁజేసి మృత్పిండములతో పితృ తర్పణములు గావించెను.

శ్రీ కపిలతీర్థ స్నానమహిమచే విగతకల్మషుఁడగు మాధవునికి పితృదేవతలు ప్రత్యక్షమై తర్పణంబును స్వీకరించిరి.

ఈ వింతచే నాకర్షింపబడిన జనులు గుంపులుగూడి చూచుచుండ ధ్యానసమాధిలో నుండిన మాధవుని శరీరమునుండి జన్మాంతర పాపచయములు భూమి ఆకాశములు నిండునట్లొక పెనుమంటగా వెడలి కొంతకాలమునకు శమించెను. అప్పు డశరీరవాణి యిట్లు పలికెను:—"తిరుమల దర్శనంబుచే నీ పాపంబులు దహింపబడినవి. శ్రీ కపిలతీర్థ ప్రభావంబున

నీకు పితృదేవతలు ప్రత్యక్షమైరి. నీ విప్పుడే పర్వతంబెక్కి పోయి శ్రీ స్వామి పుష్కరిణిలో స్నానమొనరించి యోగ బలంబుచే నీ శరీరము త్యజింపుము. ఉత్తర జన్మంబున నీవు ఆకాశరాజను క్షత్రియుడుగాఁ బుట్టి పద్మావతియను నీ కుమార్తెను నాకు కన్యాదానమొనర్చి యశస్సు గాంచగలవు.”

(వెం - పాపము, కట - నశింపజేయునది) ఈయితిహాసము మొదలు తిరుమల వెంకటాచలమని వ్యవహరింపబడుట కారంభింపబడెను.

# అధ్యాయము 2

ఈ అధ్యాయములో (A) సెక్షనులో తిరుపతిలోనుండి తిరుమలకు పోవు మార్గముల సాధారణ వివరములును (B) సెక్షనులో యాత్రికులకు అవసరమైన సంగతులును మిగత సెక్షనులలో యాత్రికులు మార్గమున బోవునపుడు గమనించ తగిన అంశములును వివరింపబడి యున్నవి.

**(A) తిరుపతి - తిరుమల మార్గము:—** తిరుమల యనగా శ్రీవెంకటేశ్వరస్వామివారి దేవాలయము గల పర్వతపంక్తి. తిరు=పవిత్రమైన, **మాల = హారము,** లేక మల = కొండ (The Sacred Hill) ఈ పర్వతపంక్తిలో నేడవ కొండపైన శ్రీస్వామివారి దేవాలయమున్నది.

తిరుపతి కుత్తరమున రెండుమైళ్ళ దూరమున **మొదటికొండ** యున్నది. ఈ కొండ అడుగుభాగమునకు “అడిప్పడి” “అడుగుమెట్టు” అని పేరు. “అడిప్పడి” అను పదము “అల్పిరి” అను వాడుకకు వచ్చెను. ఇచ్చటనుండి మెట్లమార్గముగ పోదలచిన యాత్రికులు నడిచి గాని, డోలీలు వున్నయెడల డోలీలలోగాని మెల్లగా పోవచ్చును.

కనుమబాట(ఘాట్ రోడ్డు)ద్వారా పోదలచినవారు తిరుపతి శ్రీదేవస్థానము సత్రమువద్దనుండి బయలుదేరి అలిపిరి మార్గముగ రవాణా చేయగల శ్రీ దేవస్థాన బస్సులలోగాని, అద్దె కార్లలోగాని సులభముగా అతి త్వరలో ప్రయాణము చేయవచ్చును.

ఇదిగాక చంద్రగిరి రైల్వేస్టేషనులో దిగువారు దానికి సమీపమున నున్న మంగాపుర గ్రామములో శ్రీ దేవస్థానంవారు కట్టించియుండు ధర్మసత్రము మార్గముగ మంగాపురం మెట్టు అను కొండ యడుగునకు పోయి 2 మైళ్ళు మెట్లమార్గముగ నడచి ఒకే కొండ యెక్కి శ్రీవారి దేవాలయమునకు బోవచ్చును.

మొదటిదారికి అలిపిరి మెట్లరస్తా యనియు, రెండవదారికి కనుమ బాట (ఘాట్ రోడ్డు) యనియు, మూడవదారికి మంగాపుర రస్తాయనియు పేర్లు.

మంగాపుర రస్తాలో డోలీలు మొదలగుంసౌకర్యములు తక్కువ. యాత్రికులు సాధారణముగ తిరుపతిలోనే దిగి విశేషముగ అలిపిరివైపు పోగల కనుమబాటద్వారా బస్సులలో ప్రయాణమొనర్తురు.

పైకనిన మార్గములలో తిరుపతి మెట్లమార్గమందు మాత్రము రాత్రియంతయు విద్యుద్దీపములు (Electric Lights) పట్టపగలువలె వెలుగుచుండును. ఈ కారణముచే యాత్రికులు రాత్రులయందు చాలా ప్రొద్దుపోవువరకును, వేకువజామునకు చాల ముందునుంచియు ప్రయాణము చేయుచుందురు. మంగాపుర రస్తాయందు రాత్రి 10 గంటల వరకు మాత్రము దీపములు ముండును. ప్రస్తుతం బస్సురోడ్డు వేయబడి యున్నది. బస్సులు దినమునకు మూడు పర్యాయములు వెళ్లును.

అలిపిరి రస్తాయందు తిరుపతికి మూడుమైళ్ళలో ఘూమండూరు మిట్ట అను స్థలమరదును, 4 మైళ్ళ దూరమున ముగ్గుబావివద్దను, 5 మైళ్ల

దూరమున అవ్వాచారికోన అను ప్రదేశమందును దేవస్థానపు ఠాణాలు కలవు. ఈ ఠాణాదార్లు యాత్రికులకు డోలీవార్లవల్లగాని యితరులవల్ల గాని వెట్టి తొందరలు లేకుండునట్లు కాపాడుటకై నియమింపబడి యున్నారు.

ఈ మూడు ఠాణాలవద్దను యాత్రికులు నీరు త్రాగదగిన మంచి బావులును చలివేంద్రలును గలవు.

ఈ త్రోవలో వెలగమాను యెక్కుడు, చిట్టెక్కుడు, నేరేడి మ్రాకులు అను మూడుచోట్లయందు దేవస్థానమువారు శాశ్వతమైన చలివేంద్రలు (Water Sheds) పెట్టియున్నారు.

బ్రహ్మోత్సవ సమయమున దేవస్థానమువారి రస్తాయందు అనేక తాత్కాలిక చలివేంద్రలు పెట్టుచున్నారు.

ఈ మూడు ఠాణాలవద్దను నేరేడుమ్రాకుల చలివేంద్ర వద్దను జింకుపీటు పెడ్లు కలవు.

## తిరుమల తిరుపతి దేవస్థానముల

### బస్సులు, లారీలు, ట్యాక్సీల రవాణా సదుపాయములు

**తిరుపతి** రైల్వేస్టేషను వద్దనుండు దేవస్థాన క్రొత్తసత్రం అనబడు ధర్మసత్రమునుండి తిరుమల (కొండ) శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవాలయమునకు యాత్రిక ప్రయాణీకులు బస్సులు, లారీలు, కార్లు, వగైరాలలో సులభముగా పోయిరాగలందులకు సదుపాయముగా తిరుమల-తిరుపతి దేవస్థానం కమిటీ వారిచే, కనుమబాట (ఘాట్ రోడ్) నూతనముగ 1944-వ సంవత్సరమున వేయబడినది.

తిరుపతి దేవస్థాన క్రొత్తసత్రమునుండి తిరుమల (కొండ) కనుమ బాట సుమారు 15 మైళ్లు దూరమున కలదు. ప్రతిరోజు ఉదయం మధ్యాహ్నం సాయంత్రం అర్ధగంటకు ఒక బస్సు వంతున 1½ ఘం. వెళ్లి 1½ ఘం. లో బస్సులు రాగలవు. ఉదయం 5 ఘంటలు మొదలు రాత్రి 9 ఘంటలవరకు ఒక్కొక్క బస్సు 3 పర్యాయములు పోయి రాగలదు. తిరుపతినుండి తిరుమల(కొండ)కు పోవుటకుగాని లేక అచ్చట నుండి వచ్చుటకుగాని సాదా బస్సులలో మనిషికి రూ. 1—4—0 వంతునను మొదటితరగతి బస్సులో మనిషికి రూ. 2—0—0 వంతు నను చిక్కెట్లు పుచ్చుకొని ప్రయాణము చేయవచ్చును. తిరుపతిలో బస్సు ట్రాన్సుపోర్టు ఆఫీసులో పైకం చెల్లించి టిక్కెట్లు పుచ్చుకొన వచ్చును.

తిరుపతియందు దేవస్థాన క్రొత్తసత్రపు ఉత్తరద్వారమువద్దను, తిరుమల (కొండ) యందు, దేవస్థాన ఎంక్వొయిరీ ఆఫీసు కట్టడమునకు సమీపమునను బస్సులు నిలుచుటకు తగు స్థలములు నియమింపబడినవి. సదరు స్థలములకు సమీపముననే ఒక్కొక్కబస్సు బయలుదేరుటకు అర్ధఘంట ముందునుండి ఆ యా బస్సులో నియమించిన స్థలం పరిస్థితుల ననుసరించి టిక్కెట్లు అమ్మబడును. టికెట్లుపొందిన వారియొక్క పెట్టెలు, పరుపులు వగైరా సామగ్రి మనిషి ఒకటింటికి 10 పౌన్లు తూకమునకు మించకుండా ఆయా బస్సులయందు వుచితముగా తీసుకొని పోవచ్చును. అంతులకు పైబడిన తూకముగల సామగ్రి ప్రతి 10 పౌనులకుగాని అంతకు తక్కువగాని రూ. 0—5—0 వంతున పైకము చెల్లించి టికెట్టు పొందవలయును. ఒక బస్సుటికెట్టు మరియొక బస్సుకు గాని, లేక మరియొక పర్యాయమునకుగాని చెల్లనేరదు. బిడ్డలకు అర్ధ చార్జి పుచ్చుకోబడును టికెట్లుకొని ఆ యా బస్సులలో సకాలమున ప్రయాణముచేయనివారికి డబ్బు వాపసు యివ్వబడదు. ప్రయాణికు

లందరు దేవస్థానాధికారులు నిర్ణయించిన యేర్పాటు ప్రకారమున్ను, మోటారుబండ్ల చట్ట నిబంధనల ప్రకారమున్ను నడుచుకోవలయును.

ఎక్కువ వస్తుసామగ్రి తీసుకొనిపోదలచువారికి దేవస్థానం లారీలు కావలసివుంటే తిరుపతి నుండి తిరుమల(కొండ)కు పోవుటకుగాని, అచట నుండి వచ్చుటకుగాని, వసతి ననుసరించి బాడుగకు (అద్దెకు) లభించును. దేవస్థానం టాక్సీ (బాడుగ లేక అద్దెకారు)లో శీఘ్రముగా కొండకు వెళ్లి వచ్చుటకు వసతిననుసరించి యేర్పాటు చేయబడును.

పైకనిన ప్రయాణ సదుపాయముల పొందకోరిన యాత్రికాదులు, తిరుపతియందు రైల్వేస్టేషన్ వద్ద వుండగల దేవస్థానం క్రొత్తసత్రం అనబడు ధర్మసత్రములోగాని, తిరుమల (కొండ) యందు వుండగల దేవస్థాన ధర్మసత్రములలోగాని బసచేసి సులభముగా ప్రయాణము చేయవచ్చును.

అల్పిరి :—ఇది తిరుపతి పట్టణమునుండి కొండయెక్కు మార్గమునకు ప్రారంభస్థలమైన పర్వతపాదము.

ఇచ్చట రాతిమంటపముల నడుమ పోవుత్రోవలలో సాష్టాంగముగాబడి మ్రొక్కుచుండు మనుష్య శిలావిగ్రహము కలదు. ఈ విగ్రహమునకు యిరుప్రక్కల తెలుగు అరవములలో క్రీ. శ. 1623 తేదిన కోరాల కొండయ్య కుమారుడు తమ్మయ్య సదాసేవయని లిఖింపబడి యున్నది.

ఈ విగ్రహమునకు ముందువైపున నొక మంటపమున్నది. దీనిలో గల పాదరక్షలు శ్రీవారివనియు వీనికి మొక్కి కానుకలు ముడుపులు సమర్పింపవలయుననియు చెప్పుదురు కాని ఇచ్చట సమర్పించినయెడల అవి శ్రీ వేంకటేశ్వరస్వామికి జేరవు.

ఈ అల్పిరివద్ద పెద్దగోపురము శిథిలమైయున్నది. ఇందలి శిలా శిల్పములకుగాను యిది కాపాడబడినదిగాని యాత్రికుల కషాయము కలుగకుండుటకు కటాంజనముచే చుట్టబడియున్నది. దీనికి పైగా నొక ఫర్లాంగులో మఱియొక గోపురము మంచిస్థితిలో నున్నది. పాదరక్షల మంటపమును ఈ మంచి స్థితిలోనుండు గోపురమునుగూడ మట్లకుమార అనంతరాజు కట్టించెను.

గాలిగోపురము :— ఇది ప్రథమపర్వతాగ్రముననుండు గోపురము. అలిపిరినుండి యిచ్చటికొక మైలుదూరమున్నది. ఈ త్రోవ లోని విద్యుద్దీపముల వరుస రాత్రులయందు సుమారు 20 మైళ్ళవరకు కనుబడును.

ఈ గాలిగోపురమునకు ఆనుకొని యొక మఠము గలదు. అందు హిందుస్థాన సాధువులుందురు. ఈమఠము దేవస్థానమునకు చేరినదికాదు.

శ్రీ లక్ష్మీనరసింహస్వామివారి దేవాలయము :— గాలి గోపురమునకు మూడుమైళ్ళలో ముగ్గుభావియు, తాణాయు, జింక్ పెడ్డును గలవు. ముగ్గుభావినీరు త్రాగుట కుపయోగపడును.

ఈ భావికి సమీపమున శ్రీలక్ష్మీనరసింహస్వామివారి దేవాలయ మొకటి కలదు. ఇది శ్రీవారి అర్చకులది. ఇందు శ్రీవేంకటేశ్వర స్వామి ముడుపులను చెల్లించిన యెడల అవి శ్రీస్వామివారికి చేరవు.

శ్రీభాష్యకార్లగుడి:— శ్రీలక్ష్మీనరసింహస్వామి ఆలయము నుండి కొందదూరము పోయి ఒక కనుమలోనికి దిగి మరల కొండనెక్క వలెను. దీనికి అవ్వాచారికోనయని పేరు. ఈ కోనను దాటి మోకాళ్ల మెట్లు- "మొళ్ళంగాల్ ముఱిప్పాన్ పడి" గల కొండ నెక్కినయెడల శ్రీభాష్యకార్ల గుడియున్నది.

శ్రీవైష్ణవ మతస్థాపకులగు శ్రీమద్రామానుజాచార్యులు (భాష్య కార్లు) శ్రీవారి దర్శనార్థము తిరుమలకు పోవునపుడు యీ శేషాద్రి (కొండ) భగవదంశముగనుక పాదములతో నడువరాదని మోకాళ్లపైన నడచివచ్చి యలనటచే కొంతసేపు యిచ్చట నిలచినందున ఈ స్థలమున వారి గుడి కట్టబడినది.

ఇది శ్రీవేంకటేశ్వర దేవాలయమునకు జేరినది. శ్రీవారి దేవాలయమునుండి ప్రతిదిన మిచ్చటికి నైవేద్యమువచ్చును. అయినను యిచ్చట కానుకలుగాని ముడుపులుగాని సమర్పించరాదు. శ్రీవేంకటేశ్వరుల ముడుపులనుగాని శ్రీభాష్యకార్లకు చెల్లించ నుద్దేశించిన కానుకలకు గాని శ్రీవెంకటేశ్వర దేవస్థానం ఖచేరిలోనే చెల్లించవలయును.

సారె పెట్టెలు:— శ్రీభాష్యకార్లగుడి మొదలు పోవుమార్గము సులభము. దీనికి కొన్ని గజములలో పెట్టెలు పేర్చినట్లు శిల లొకటిపై నొకటి యందముగా నమరియున్నవి. ఈ పెట్టెల నలుదిక్కుల నాంజనేయ విగ్రహములు చెక్కబడియున్నవి.

శ్రీవేంకటేశ్వరస్వామి దేవియగు శ్రీపద్మావతియమ్మవారు తిరుమలకు వచ్చుచుండి యీ ప్రదేశమునకు రాగా నామె కే కారణము వల్లనో కోపము వచ్చినందున పెట్టెల నిచ్చట దించి హనుమంతుని కావలి యుంచి తాను పద్మసరోవర మను నామాంతరము గల తిరుచానూరికి తిరిగి పోయెనని చెప్పుదురు. ఇచ్చట గోచరించు అడుగుజాడలు శ్రీఅమ్మవారివే యని యాత్రికులు వానిని పూజించుటయు గలదు.

ఇవి దాటి యొక మైలుదూరము సులభముగా నుండు మార్గమున పోగా సూర్యరశ్మిచే నిగనిగలాడు శ్రీవేంకటేశ్వర దేవాలయపు గోపురముపై నుండు బంగారు కలశముల కాంతి యాత్రికులకు కనుపించు చుండును.

# అధ్యాయము 3

**తిరుమల: దీని నామాంతరములు:—** తిరుమల యను పదమునకు ద్రావిడమున తిరు = శ్రేష్ఠమైన, మలై = పర్వతము (The Sacred Hill) అని యర్థము. ఈ శబ్దము తిరుపతి మొదలు ఉత్తరముగా గల పర్వత పంక్తి మొత్తమున కన్వయించుటయేగాక శ్రీవేంకటేశ్వర దేవాలయముండు యేడవ పర్వతమునకు విశేషించి వర్తించుచున్నది. ఇది 2500 అడుగుల యెత్తుగలది. ఈ పర్వతపంక్తి తూర్పు కనుమలలో జేరి తిరుపతి కొండలని సాధారణముగ వ్యవహరింపబడుచున్నది.

ఇప్పుడు జరుగుచుండు శ్రీ శ్వేతవరాహకల్పము మొదట శ్రీమన్నారాయణుండు వరాహరూపముచే చాపచుట్టగా పాతాళమునకు గొనిపోయి చెఱబెట్టబడిన భూదేవి నుద్ధరించిన సమయమున బ్రహ్మాదులచే ప్రార్థితుండై శ్రీహరి దుష్టనిగ్రహ శిష్టరక్షణార్థ మీ భూమియందుండుటకు సమ్మతించిరనియు ఆసమయమున శ్రీవైకుంఠమున శేషాహిరూపమున నుండు తన క్రీడాచలమును శ్రీదేవీసహితముగ గరుత్మంతునిచే తెప్పించుకొని స్వర్ణముఖీనదీ సమీపమున నుండునీ స్థలమున నిల్పిరనియు అదిమొదలుకొని యిచ్చటనే వరాహమూర్తి వేంచేసి యున్నారనియు ఈ కారణముచే శ్రీస్వామిపుష్కరిణీ సమేతమైన యీ పర్వతము శ్రీవైకుంఠమున నుండిన దైవనగమే కాని యితరము కాదనియు పురాణప్రసిద్ధము.

## తిరుమలకుగల ముఖ్యమైన యితర నామములు

1. చింతామణిశైలము—కోరినకోరికల నొసగునది.
2. జ్ఞానాద్రి—జ్ఞానమును వృద్ధిచేయునది.
3. తీర్థాచలము—పుణ్యతీర్థములు గలది.

పుష్కరశైలము—పుష్కరిణులుగలది.

5. ఋషభాద్రి—ఋషభుడను రాక్షసుడు తపముజేసి ముక్తి గాంచినది.

6. కనకాచలము—దేవతలకు బంగారు మయముగా గాన్పించునది.

7. నారాయణశైలము—నారాయణుఁడను ఋషి తపస్సుజేసి సిద్ధి బొందినది.

8. నరసింహగిరీంద్రము—శ్రీనరసింహస్వామి ఆవిర్భవించినది.

9. అంజనాద్రి—అంజనాదేవి తపముచేసి హనుమంతుని పుత్రునిగ గాంచినది.

10. వరాహాద్రి—శ్రీహరి యిచ్చట వరాహరూపమున నిల్చినది.

11. నీలాద్రి—నీలుఁడను వానరుఁడు తపస్సుచేసినది.

12. శ్రీగిరి—శ్రీదేవికి నివాసస్థానము.

13. క్రీడాద్రి—లక్ష్మికి ఆటపట్టైనది.

14. గరుడాచలము—గరుడుఁడు వైకుంఠమునుండి తేబడినది.

15. శేషాద్రి—శేషుని రూపమున నున్నది.

16. వేంకటాచలము—వ-అమృత బీజము ; కట-సంపదర్థకము అనగా అమృత సంపదల నిచ్చును. మరియు వెం-పాపమును కట-దహించునది గాన వేంకటాద్రి. ఇట్టివి ఇంకను కలవు.

ఇచ్చట విష్ణువు రమాసహితుఁడై నిత్యసూరులతోడను ముక్తుల తోడను దేవతలతోడను సూర్యమండల వైకుంఠములపై గల ప్రేమకు మించిన ప్రీతివిశేషముతో నిత్యలీలా విహారము గావించుచు భక్తులు కోరినవరము లొసగి పోషించుచుండును.

శ్లో॥ అయం భగవతో హ్యాద్యః పర్వతః పుణ్యకాననః
మంత్రసిద్ధి స్తపస్సిద్ధి ర్యజ్ఞసిద్ధి స్తథైవ హి ॥
కామ్యస్య కర్మణస్సిద్ధి రేవమన్యాశ్చ సిద్ధయః
భవ న్త్యత్ర నరాణాం చ న హి విఘ్నాదికం క్వచిత్ ॥
అల్పేన తపసాఽభీష్టం సిధ్యత్యస్మిన్ గిరౌ వరే
సర్వతీర్థాని సతతం పుణ్యాన్యత్రైవ స న్తి హి ॥
య ఏనం సేవతే నిత్యం శ్రద్ధాభ క్తిసమన్వితః
జ్ఞానార్థీ జ్ఞానమాప్నోతి ద్రవ్యార్థీ కనకం బహు ॥
పుత్రార్థీ పుత్రమాప్నోతి నృపో రాజ్యం చ విందతి ।
వ్యజశ్చ సాజసద్రూపం పశూన్ధాన్యాని విందతి ॥
యం యం కామయతే మ ర్త్యః తం తమాప్నోతి సర్వధా ।
చి న్తితస్య చ సిధ్యా తు చిన్తామణి మిమం విదుః ॥

—శ్రీవరాహ పురాణము.

**తిరుమల దేవాలయము: తిరుమల గ్రామము:**— ఈ పర్వత పం క్తియందేడవకొండపై నెలకొనియున్న శ్రీవెంకటేశ్వరస్వామివారి దేవాలయము చుట్టును 1000 యిండ్లుగల గ్రామమున్నది.

శ్రీవెంకటేశ్వర దేవస్థానమును ఆనుకొని యు త్తరమున శ్రీస్వామి పుష్కరిణియు, పుష్కరిణి పశ్చిమతటమున శ్రీవరాహస్వామి దేవాలయమును గలవు.

ఈ రెండు దేవస్థానములకును పుష్కరిణికిని చుట్టు నాల్గు వీధుల లోను, వీనిమధ్యనుండు సందులలోను తిరుమల గ్రామమున్నది. ఈ నాలుగు వీధులకు మహాప్రదక్షిణమని పేరు. శ్రీ తిరుమల తిరుపతి దేవ స్థాన కమిటీవారు యీ గ్రామమునందు (Pipes) కొళాయిల ద్వారానీటి వసతిం గల్పించియున్నారు. ఎలెక్ట్రిక్ దీపములచే గ్రామమును వెలి

గించుచున్నారు. ఈ గ్రామముయొక్క ఆరోగ్యము, పరిశుభ్రత, వైద్యము మొదలగు విషయముల భారమును సంపూర్ణముగా దేవస్థానము వారే వహించి వానికి తగిన యుద్యోగి శాఖల (Departments) నేర్పఱచి దేవస్థాన ఖర్చులతో వీనినంతయు జరిపించుచున్నారు. సకలపరికరములతోఁ గూడిన (Hospital) వైద్యశాలను పెట్టియున్నారు. బ్రహ్మోత్సవ కాలములో ఆయుర్వేద వైద్యసహాయము నొసగు చున్నారు.

లక్షలకొలది యాత్రికుల సమ్మర్దము ప్రతి నిత్యమును గలిగిన ఈ గ్రామమునకు విధ్యుక్త ధర్మముగా నొక లోకల్ సెల్ఫ్ గవర్నమెంటు బోర్డు చేయించవలసిన పై కార్యములను విశేష ధనవ్యయ మొనర్చి శ్రీ దేవస్థానపు కమిటీవారు నిర్వర్తించుచున్నారు. గాన గవర్నమెంటు వారికమిటీకి యితరుల మునిసిపాలిటీ, జిల్లాబోర్డులకు ఆరోగ్య విషయమున గ్రామవాసులపై నుండు అధికారము గల్పించిరి. గాన నీపనుల కిది యింకను ననుకూలముగా నుండును.

ఈ గ్రామమునకు వచ్చు యాత్రికులు దిగుటకై శ్రీదేవస్థానము వారు అనేక విడుదుల (బసల) నేర్పఱచి వానిలో కొళాయిలు, ఎలక్ట్రిక్ లైట్లు మొదలగు సౌకర్యముల నమర్చియున్నారు.

తిరుమలలో యాత్రికులకుగాను దేవస్థానమువారు గావించిన యేర్పాటులు:— యాత్రికులకు చక్కగా బోధపడుటకై దేవస్థానము వారు యాత్రికులకుగాను కట్టించియున్న కట్టడము లీక్రింద వివరింపబడి యున్నవి.

1. వెయ్యికాళ్ల మండపము:— ఇది దేవస్థానమున కెదురుగ నుండు గొప్ప మండపము. దీనిలో 70 కుటుంబములు దిగుటకనుకూలము. నీటిసౌకర్యము, యెలక్ట్రిక్ లైట్లు, ఇతర సౌకర్యములు అన్నియు గలవు.

2. వెయ్యికాళ్ల మండపము:— మేడమీద గదులు 35

3. దివాణము కట్టడము:— తూర్పు మాడవీధియందు ప్రూని తేరికి ప్రక్కన సకలసౌకర్యములతోను యెలక్ట్రిక్ లైట్లుగల యిల్లు. ఇది ఆలయమునకు సమీపముననున్నదిగాన నిది యాత్రికుల నధికముగా నాకర్షించుచున్నది.

4. ప్రాతకచ్చేరి కట్టడము:— ఇది విశాలమైన కట్టడమగుట చేత, అయిదు, ఆరు కుటుంబముల యాత్రికులు దిగుటకు చాల అను కూలముగా నున్నది. పెండ్లి, ఉపనయనములు జరుపుటకును వసతిగా నున్నది. దీనికి విచారణకర్తలవారి ఆఫీసు అని పేరు.

5. సిమెంటుకాంక్రీటు కట్టడములు, 5 :— ఇవి శ్రీదేవస్థాన కమిటీవారిచే నూతనముగా రూ. 78,000 ఖర్చుతో గట్టబడినవి. వీనిలో నన్నివసతులును గలవు. వీనిలో 20 కుటుంబములవారు దిగుటకు వసతి గలదు.

1. సబుస్ట్రేషన్ సిమెంటుబ్లాకు—రామానుజకూటము.
2. డోలీమండపము సిమెంటుబ్లాకు—శ్రీనికేతనము.
3. ఆళ్వార్ చెఱువు సిమెంటుబ్లాకు—అనంతవిలాస్.
4. మేదరమండపము—సిమెంటుబ్లాకు.
5. ఉత్తరమాడ సిమెంటుబ్లాకు—వరాహనివాసము.

6. శ్రీదేవస్థానధర్మసత్రము (The Devasthanam free Choultry) :— ఇది పశ్చిమమాడ వీధిలో మైసూరు మహారాజాగారి సత్రము ప్రక్కననున్నది. ఎలెక్ట్రిక్ లైట్లు అమర్చబడియున్నది. దీనికి పిఠాపురపుసత్రమను పేరును గలదు.

7. యతిరాజాశ్రమము:— ఇది పశ్చిమ మాడవీధిలోనున్నది.

8. ఉత్తరమాడ జింగ్ షెడ్లు:— ఇవి చాలవిశాలమైనవి. ఎప్పుడును తెరువబడియుండునవి. యాత్రికుల గుంపులు దిగుట కను కూలము. ఇదే కృపవిలాసము.

రహదారి బంగళా:— ఇవిగాక దేవస్థానమువారు ఘ్యాట్పైన తిరుమలకు రాదగు గవర్నమెంటు ఉద్యోగస్థులవసతికి గాను ఒకముసాఫరు బంగళానుగూడ నిర్వహించుచున్నారు.

ఈ దేవస్థాన కట్టడముల సౌకర్యములు తిరుమలలో వీనిలోతప్ప మఱియొకచోట దొరకవు. స్వల్ప సంఖ్యాకులగు యాత్రికులు దిగు టకు కొన్ని సత్రములును, మఠములును, బాడుగకు దొరకు యిండ్లును గలవు. కాని వానిలో సౌకర్యములు తక్కువగను బాధలధికముగ నుండును.

భోజన సౌకర్యములు:— పైన వివరింపబడిన దేవస్థాన కట్ట డములలో దిగిన యాత్రికులు తమకు ఆయా కట్టడములలో నుండు దేవస్థాన యుద్యోగులుచితముగా నొసగు పాత్రసామానుల తీసికొని వంట చేసికొనవచ్చును. లేదా శ్రీస్వామివారి దేవస్థానములో పగలు 2 పూటలు, రాత్రి 1 పూటయు, ఉచితముగా నిచ్చు ప్రసాదములను భుజింపవచ్చును.

మైసూరుమహారాజుగారి సత్రమునందు పగలు 1 పూట మాత్రము బ్రాహ్మణులకును, శ్రీపరకాలస్వామి మఠమున కొందరు శ్రీవైష్ణవులకు మాత్రమును, శ్రీ అహోబిల మఠమున నలుగురు శ్రీవైష్ణ వులకు మాత్రమును భోజనము దొరకును, గాని శ్రీవారి దేవస్థానములో నాల్గు వర్ణస్థులకును మూడుపూటలును ఎందరు వచ్చినను శ్రీస్వామివారి ప్రసాదము దొరకునట్లు యితర చోట్లయందు లభింపదు.

భోజనమొసగు హోటళ్లు, కాఫీక్లబ్బులు, పూటకూళ్లయిండ్లు అనేకములు గలవు.

ఆస్పత్రి—ఆయుర్వేద ఔషధములు:— తిరుమల గ్రామము యొక్క ముందుభాగమున నుండు మంచి కట్టడములో శ్రీదేవస్థాన ఆస్పత్రి యున్నది. దేవస్థానము వారు దీనిని యాత్రికుల కొఱకై ధర్మార్థముగా పెట్టియున్నారు.

ఆంగ్లవైద్య పరీక్షలలో తేరిన ఒక డాక్టరును తగు శిబ్బందీలతో నియమించి సాలు 1-కి సుమారు రూ. 5000 లు వ్యయముజేసి యాత్రికుల కీ దేవస్థానమువారు వైద్య సహాయ మొసగుచున్నారు. ప్రతి సంవత్సరము బ్రహ్మోత్సవ కాలమందు ఆయుర్వేద వైద్యశాల నేర్పఱచుచున్నారు. సం 1-కి 16,000 జను లీ వైద్యశాలల సహాయమును పొందుచున్నారు.

యాత్రికు లీ తిరుతిరుమలకు వచ్చిన వెంటనే తమ సామానులను బసలయందు భద్రపఱచుకొని భోజనాదికముల కేర్పాట్లు గావించుకొని శరీరారోగ్యములను గమనించుకొని ప్రార్థనల ననుసరించి ముడియిచ్చి శ్రీస్వామి పుష్కరిణిలో శుచిస్నాన మొనరించుకొని పుష్కరిణి పశ్చిమ తీరమున నున్న శ్రీవరాహస్వామి వారిని తొలుత దర్శించుకొని పిదప శ్రీవెంకటేశ్వరుల సన్నిధి కేగవలసినది ఆచార పద్ధతి.

కల్యాణ ఘట్టము (మంగలి కట్ట):— తిరుమల గ్రామములో ఆసుపత్రి ప్రక్కన క్రొత్తగా గట్టబడిన కట్టడమందు యాత్రికులు ప్రార్థనల ప్రకారము జుట్టు తీయించుకొందురు.

శ్రీస్వామి పుష్కరిణి:— ఇది శ్రీవారి దేవాలయముయొక్క ఉత్తరప్రాకారమును ఆనుకొనియున్నది. దీని ప్రభావము వర్ణనాతీతము. ఇది గంగాది పుణ్యనదీ సమూహములకు మాతృదేవత. సకల తీర్థ

ములలో నిది మిక్కిలి శ్రేష్ఠమైనది. ఈ పుష్కరిణి వైకుంఠమున శ్రీదేవి, భూదేవి, నీళాదేవులతో శ్రీమన్నారాయణుఁడు క్రీడాచలమందలి దనియు శ్రీవరాహావతార కాలమున వారికి భూలోక నివాసార్థమై గరుడు నిచే వైకుంఠమున నుండి క్రీడాద్రితోడ తేబడినదనియు పురాణప్రసిద్ధి.

ఇందలి స్నానము సర్వపాపములను పరిహరించును; సకలదోష ములఁ బోగొట్టును; సకలార్థముల నిచ్చును; కోరికల నొనగూర్చును.

శ్లో॥ స్వామి పుష్కరిణీ స్నానం సద్గురోః పాదసేవనమ్ ।
ఏకాదశీ వ్రతం చాపి ప్రియమత్యంత దుర్లభమ్ ॥
దుర్లభం మానుషం జన్మ దుర్లభం తత్ర జీవనమ్ ।
స్వామి పుష్కరిణీ స్నానం త్రయ మత్యన్త దుర్లభమ్ ॥
అత స్తస్య తు మాహాత్మ్యం వక్తుం శేషోఽపి న ప్రభుః ।
యత్తు స్వామిసరఃస్నానం మహాపాతక నాశనమ్ ॥

—వరాహపురాణము.

ఈ పుష్కరిణి పశ్చిమతీరమున నుత్తరము శ్రీవరాహ దేవాలయ మును, దక్షిణమున నొక యశ్వత్థ వృక్షమును (రావిచెట్టు) గలవు.

శ్రీవారు ఆకాశరాజుకూతురైన శ్రీపద్మావతియమ్మ వారిని పెండ్లి చేసికొనునపుడు వివాహపు ఖర్చులకుగాను కుబేరునివద్ద అప్పు తీసుకొని ఈ వృక్షముక్రింద కుబేరునికి అప్పుపత్రము వ్రాసి యిచ్చిరనియు పురాణము వచించుచున్నది.

ధనుర్మాసమున ముక్కోటి ద్వాదశినాడీ పుష్కరిణిలో శ్రీచక్ర త్తాళ్వార్లు తీర్థము ప్రసాదింతురు. అది చాల పుణ్యకాలము.

ఈ పుష్కరిణి మధ్యనొక నీరాడి మండపముగలదు. అందు దశావతారము లతి నైపుణ్యముగా శిల్పింపబడియున్నవి.

ప్రతి సంవత్సరము మార్చి, యేప్రిలు నెలలో శ్రీవారికి పుష్కరిణియందు తెప్పోత్సవము అతివైభవముగా జరుగును.

యాత్రికులీ పుష్కరిణియందు స్నానమాడి తొలుత శ్రీవరాహస్వామివారిని దర్శించుకొనవలయును. పిదప శ్రీవెంకటేశ్వరస్వామివారిని దర్శించవలెను.

శ్రీవరాహస్వామి దేవాలయము:— ఈ తిరుమల యంతయు శ్రీవరాహస్వామి క్షేత్రము. పూర్వము వీరీ క్షేత్ర దైవమై వరప్రసాదియై యుండిరి.

శ్రీవారు యీ పర్వతమున ఆవిర్భవించిన యనంతరము శ్రీవరాహదేవులు తమ ప్రభావమును ఉపసంహరించుకొనిరి గాని, నేటికిని వీరికి నిత్యపంచామృతస్నానమును మొదట పూజానైవేద్యములును తదనంతరము శ్రీ వెంకటేశ్వరస్వామివారికి నివేదన జరుగుచున్నది.

శ్రీ వేంకటేశ్వరులు శ్రీ వరాహస్వామిని 100 అడుగుల నేల యాచించి తీసుకొనిరనియు ఆకాలమున నీ యగ్రపూజా నైవేద్యంబులును మున్ముందు శ్రీ వరాహస్వామివారికి చేయించి తాను పిదప నైవేద్యమంగీకరింతునని శ్రీ వేంకటేశ్వరు లొడంబడిరనియు పురాణము తెలుపుచున్నది.

శ్లో॥ స్థలం దేహ్యవనీకాంత యావత్కలియుగం భవేత్ ।
ఇతి తేన స విజ్ఞప్తో వరాహవదనో హరిః ॥
ఉవాచ వచనం దేవ స్థలం మూల్యేన గృహ్యతామ్ ।
ఇతి వాక్యం తత శ్శ్రుత్వా ప్రోవాచ మధురం వచః ॥
ప్రథమం దర్శనం చాస్య నైవేద్యం క్షీరసేచనం ।
ఇదమేవ పరం ద్రవ్యం దదామి కరుణానిధే ॥

ఇత్యుక్తో హరిణా పోత్రీ హరయే స్థాన కాంక్షిణే।
తదా దదా స్థలం పాద శతమాత్రం రమాపతేః॥

—భవిష్యోత్తర పురాణము.

ఈ వరాహస్వామి గుడికి ముందుండు పుష్కరిణి భాగమునకు వరాహ పుష్కరిణి యను ప్రత్యేక నామము గలదు.

శ్రీవరాహస్వామివారి దర్శనమునకుముందు శ్రీవేంకటేశ్వరస్వామి వారిని సందర్శించుట శ్రీవారికి తృప్తికరము కాదు.

శ్లో॥ వరాహ దర్శనా త్పూర్వం శ్రీనివాసం నమేన్నచ।
దర్శనా త్ప్రాగ్వరాహస్య శ్రీనివాసో న తృప్యతి॥

—బ్రహ్మపురాణము.

---

# అధ్యాయము 4

**శ్రీవేంకటేశ్వర దేవస్థానము:**— ఈ దేవస్థానము చాల పురాతనమైనది. కలియుగారంభమున నారాయణ పురాధీశుడుగా నుండిన ఆకాశరాజు తమ్ముడును శ్రీనివాసుని పరమ భక్తుడు నగు తొండమాన్ చక్రవర్తి యీ దేవాలయమును గోపుర ప్రాకార సహితముగ కట్టించి శ్రీనివాసుని మహోత్సవ వైభవంబులతో నిలిపెనని పురాణములవలన తెలియుచున్నది.

శ్లో॥ తొండమానితి తం ప్రాహుః ద్రావిడా ద్రవిడేశ్వరం।
జన్మ ప్రభృతిదాసస్సన్ సదా విష్ణు పరాయణః॥
మండలాధిపతి ర్భూత్వా దివ్యనారీసహస్రభాక్।
ప్రత్యహం చ బిలద్వారా ద్గత్వా వేంకటపర్వతం॥

అన్వహం చ కరోతిస్మ పూజాం తస్య మహాత్మనః।
భక్త్యుద్రిక్తమనో భూత్వా దదౌ గ్రామాననేకశః॥
ప్రాకారద్వయసంయుక్తం గోపురద్వయసంయుతం।
గర్భాగారసమాయుక్త మకరోద్దివ్యమాలయం॥
తథా మహానసాగారం యాగమండపమేవ చ।
ధాన్యాగారం చ గోశాలాం యద్యదంగం హరేశ్శుభం॥
కారయామాస తత్సర్వం అష్టావింశే కలౌయుగే
తథోత్సవవిధిం తస్య కారయామాస వైదికైః॥

— బ్రహ్మపురాణము.

వైఖానస ఋషిశ్రేష్ఠైః బ్రాహ్మణైర్బ్రహ్మవిత్తమైః।
ఋక్సామగాయకైశ్చైవ మంత్రైశ్చ విధిపూర్వకం॥
వాదిత్రైర్వాద్యమానైశ్చ ఘోషయద్భిర్దిశోదశ।
దేవైర్బ్రహ్మ పురోగైశ్చ స్తువద్భిస్స్తుతిభిర్హరిమ్॥
ప్రవేశయామాస వరం సుమందిరం
శ్రీ శ్రీనివాసం పురుషం పురాణం।
పద్మావతీం చాపి ముదా మహీపతి
స్సమస్తలోకై ర్మునిభిర్మహోత్సవైః॥
తత ఆనందనిలయే తోండమాన్నృపనిర్మితే
విమానాగ్రే శ్రీనివాసో రరాజ భగవాన్ హరిః॥

చరిత్రకాలమున హిందూ రాజులచే దేవాలయగర్భగృహము పునరుద్ధరణము గావింబడెను. వీరిచే గర్భగృహముపై నుండు విమానము బంగారు పూతచే నలంకరింపబడి దానిపై స్వర్ణకలశము ప్రతిష్ఠింపబడెను.

బంగారు వాకిటిముందు "తిరు మహా మండప" మను ముఖ మండపమును దేవాలయములోని ఇతర మండపములు మొదలగునవి గోపురము బైటనుండు వెయ్యికాళ్ళ మండపమును హిందూరాజుల కైంకర్యములు.

పడి కావలి:— శ్రీవేంకటేశ్వర దేవాలయ సింహద్వార మను మొదటి ద్వారమునకు "పడికావలి" యనిపేరు. ప్రతి దినమును ప్రాతఃకాలమున "హరికొలువు" అను మంగళ వాయిద్యమయిన పిదప ఈ ద్వారము తెరువబడును.

పడికావలి దాటిపోయిన, లోపలి ప్రక్క "లాలఖేమరాము" "మాతామోహానుదే" "పితా బీబీ తోదరమల్లు పెండ్లాము" అను పేరులు లిఖింపబడిన మూడు విగ్రహములు గలవు. ఇవి అక్బరు చక్రవర్తియొక్క మంత్రియగు రాజా తోడరుమల్లుని కుటుంబమునకు చేరిన వను జనవాక్యమున్నది గాని శాసనాధారములు లేవు.

శ్రీవేంకటేశ్వరుల భక్తశిఖామణియు, విజయనగర చక్రవర్తియు నగు శ్రీకృష్ణదేవరాయలు, వీరి భార్యలు తిరుమలదేవి చిన్నాదేవి, వీర్ల తామ్రవిగ్రహమును, అచ్యుత రాయలయొక్కయు అతని భార్య వరదాజీయమ్మ యొక్కయు శిలావిగ్రహములును గలవు.

యాత్రికులు పడికావలి దాటిపోయి ధ్వజస్తంభమునకును దాని ప్రక్క నుండు క్షేత్రపాలక శిలకును నమస్కరింతురు. అర్చకులు యింటినుండి దేవస్థానములోనికి పోవునపుడును ఆలయమునుండి యింటికి పోవునపుడును బీగము చెవులను యీ క్షేత్రపాల శిలకు తాకించి పోవుదురు. క్షేత్రపాలకులు గోగర్భమను తీర్థమున పూర్ణకళలో తేజరిల్లుచున్నారు.

**సంపంగి ప్రదక్షిణము:—** ముఖద్వారమునకును 2-వ ద్వారమునకును మధ్యనున్న ప్రదక్షిణమునకు సంపంగి ప్రదక్షిణమని పేరు. దీనిలో 'విరజ' యను చిన్న బావికలదు. శ్రీవారి పాదములక్రింద 'విరజా' నది ప్రవహించు చున్నదనియు ఈబావి ఆ నదియొక్క భాగమనియు చెప్పబడుచున్నది. ఈ ప్రదక్షిణములో 'పూలబావి' యను బావి యున్నది. శ్రీవారికి సమర్పించిన పుష్పమును తులసిని యితరులుపయోగింపరాదని వానిని ప్రతిదినమును యీ బావిలో సమర్పింతురు. తిరుచానూరిలో శ్రీపద్మావతి అమ్మవారికి ప్రతి సంవత్సరము జరుగు పంచమితీర్థ మహోత్సవము నాడు మాత్రము శ్రీవారికి సమర్పింపబడిన పుష్పమును తులసియును పూలబావిలో వేయబడక శ్రీపద్మావతి అమ్మవారికి పంపబడును. అవి అమ్మవారికి ఆ దినము సమర్పింపబడి వినియోగము చేయబడును. ఆనాడు తప్ప యితర దినములలో శ్రీవారికి సమర్పణ యగు పుష్పములును తులసియు యెవరికిని ప్రసాదముగా నివ్వరు.

ఈ సంపంగి ప్రదక్షిణమైన తరువాత రెండవద్వారము దాటి లోపలి పోయిన యెడల శ్రీవారి గర్భగృహముపైనున్న ఆనందనిలయ విమానము చుట్టి వచ్చు విమాన ప్రదక్షిణము గలదు.

**విమానప్రదక్షిణము:—** ఈ ప్రదక్షిణమునందు శ్రీయోగనరసింహస్వామి, శ్రీవరదరాజస్వామి, వీరల ఆలయములును, శ్రీభాష్యకార్ల గుడియు, శ్రీసేనాధిపతి నిలయమును, శ్రీగరుడాళ్వారు మందిరమును వంటశాలయందు శ్రీవకుళమాలికా నికేతనమును గలవు.

**వైకుంఠ ప్రదక్షిణము:—** విమాన ప్రదక్షిణముగాక శ్రీవారి గర్భాలయము చుట్టును వైకుంఠ ప్రదక్షిణమున్నది. ఇది యెప్పుడును

మూయబడియుండి ధనుర్మాసమున శుక్లపక్షపు ఏకాదశినాడు (ముక్కోటి ఏకాదశి) మాత్రము తెరవబడును.

తిరుమహామణి (గంట) మంటపమనే ముఖమంటపము:— ఇది శ్రీవారి గర్భాలయముయొక్క మొదటి ద్వారమునకు ముందుండు మంటపము. ఈ ద్వారమునకు బంగారువాకిలి అని పేరు. ఈ వాకిలికి యిరుప్రక్కలను బంగారుపూత కటాంజనములో జయవిజయులను ద్వారపాలక మూర్తులును, దక్షిణమున శ్రీవారి నైవేద్యకాలమున వాయించబడు రెండు పెద్ద గంటలును ఉత్తరపార్శ్వమున యాత్రికులు తెచ్చు ముడుపులు కానుకలు వగైరాలను సమర్పించవలసిన హుండియు, హుండికి తూర్పున శ్రీదేవస్థానం పారుపత్యదారుని కచ్చేరియు కలవు. ఇవియన్నియు ఈ ముఖమంటపములో నున్నవి.

గర్భాలయము:— బంగారు వాకిటినుండి రెండుద్వారములు దాటిన యెడల శ్రీవారి దర్శనమగును.

శ్రీవారి దర్శనార్థము వచ్చువారు ఆయుధములు, చేతికర్రలు, తోలు మొదలగువానిని పడికావలిలోనే వదలి షరాయి ధరించియున్న యెడల దానిని తీసివేసి దోవతి యంగవస్త్రము ధరించి లోపలికి పోవలయును. యీ నిబంధనలు గమనించని వారిని బంగారు వాకిలి దాటనివ్వరు. స్నానముచేయనివారును అశుచిగా నుండువారును లోపల పోరాదు. వారు దేవునియెడల మహాపరాధము జరిపిన వారగుదురు.

ఘోషాస్త్రీలు శ్రీదేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ (Executive Officer) వారి యుత్తరవు బొంది తమ మేనాలోగాని సవారిలోగాని పడికావలిదాటి ధ్వజస్తంభము చెంతనున్న తిరుమలరా యని మంటపము వద్ద సవారి దింపి యటునుండి పటాటోపము లేక "ఖణితి పరదా" అను

ముసుగులో బంగారు వాకిటివరకు వచ్చి యచ్చటనుండి లోపలికి ముసుగులేకుండ వెళ్ళవలయును. ఘోషాస్త్రీలకు ఆర్జితసేవలగు తోమాలసేవ అర్చన, అభిషేకము, యేకాంతసేవ యను దర్శనములు తప్ప ధర్మదర్శన కాలములందు ముఖ్యముగా నుండవలసిన అర్చకులు ఉద్యోగీయులు మాత్ర ముండి యితరులు లేకుండ దర్శనము చేయుటకు పారుపత్యదారు వారికి ముందుగా తెలుపుకొన్న యెడల వారట్లు యేర్పాటు చేయుదురు.

శ్రీవారి పూజాదర్శనక్రమములు, 1. సుప్రభాతము:— శ్రీవారి గర్భగృహముయొక్క మొదటి ద్వారమైన బంగారువాకిలి ప్రతినిత్యము ప్రాతఃకాలము 6, 7 గంటలకు అర్చకులు గుడికి వచ్చిన వెంటనే తెరువ బడును. కైంకర్యపరులు సుప్రభాతము సు=మంచి, ప్రభాతము=ఉద యము, అను మంగళశ్లోకములను పఠించి లోపలికి పోయి స్థలాచార ప్రకారము శ్రీవారి కైంకర్యపరులు తీర్థ ప్రసాదములు స్వీకరింతురు.

ఇవి జరుగుచుండగా లోపలినుండి మంచము, పఱుపు, మొదల గునవి బయటికి తీసుకొనిపోబడును. ఈ సమయముననే పారుపత్యా దారు కచ్చేరియెదుట హుండి యను కొప్పెర కట్టబడును. నేలనుండి మనిషి యెత్తునకు వ్రేలాడ గట్టబడి లోపల పెద్ద గంగాళము గలిగిన సంచిని కొప్పెరయందురు. దీనిలో యాత్రికులు తెచ్చు ముడుపులు కానుకలు వగైరాలను వేయవలయును; లేదా పారుపత్యదారు కచ్చే రిలో కట్టి రసీదు తీసుకొనవలయును. ఈ రెండు మార్గములు తప్పి యితరుల చేతికిచ్చినయెడల నవి శ్రీవారికి చేరవు.

సుప్రభాత సమయమున శ్రీవారి కైంకర్యపరులు తప్ప యితరు లుండకూడదు. ఇతరులకు ప్రవేశము దుర్లభము. స్త్రీలను బాలు రను అప్పుడు లోపలికి విడువరు.

2. విశ్వరూపదర్శనము (ధర్మదర్శనము) :— శుక్రవారము నాటి యుదయమున తప్ప మిగత దినములందు ఇది ధర్మదర్శనము. సుప్రభాతమైన తరువాత యాత్రికులు ద్రవ్యము చెల్లించు నవసరములేక ఉచితముగా వారిని లోపలికి దర్శనమునకు వదలుదురు.

జనస్తోమ మధికముగా నుండినను తడవకు కొందరు కొందరుగా ధర్మదర్శనమున కందరిని నిదానముగా లోపలికిపంపి, యాత్రికు లందరికిని దర్శనము చేయింతురు. గనుక త్రొక్కుడుబడక నిదానముగా ఒకరు వెంబడి ఒకరు వరుసగా లోపలికిపోయి శ్రీస్వామివారి దర్శనము తృప్తిగా జేసికొని రావచ్చును.

ఈ విశ్వరూప దర్శనము విశేష మహిమగది. పూర్వ రాత్ర మున దేవస్థానము తలుపులన్నియు మూయబడి యాలయము మనుష్య సంచారము లేక యుండిన తరుణమున సమస్త దేవతలతో బ్రహ్మ విచ్చేసి శ్రీవారికి స్వయముగా నారాధన మొనరించుననియు ఆ యారా ధన సంబంధమైన తీర్థమే ఈ విశ్వరూప దర్శనకాలమున మానవులకు లభించుననియు నైతిహ్యము కలదు.

యాత్రికులు శుచిస్నాతులై షరాయి మొదలగు వాడంబర వేష ములను వదలి శాస్త్రీయ వేషమున లోపలి కేగవలయును. బంగారు వాకిలి దాటి నేరుగా లోపలికి పోయిన మొదల శ్రీస్వామివారి సమీపమున గర్భగృహ ప్రథమ ద్వారమున్నది. దానికి "కులశేఖరపడి" యని పేరు. కైంకర్యపరులు మాత్రమే యీద్వారమును దాటి లోపలికి పోవచ్చును. దీనికి సమీపమున నడ్డముగా వేయబడిన "తండు" అను అడ్డకట్ట వద్ద యాత్రికులు నిలిచి శ్రీస్వామివారిని దర్శనము చేసికొని తీర్థ ప్రసాద శఠారుల స్వీకరింపవలయును.

శ్రీస్వామివారికి కర్పూరమంగళహారతి చేయించవలయునని కోరు వారు ముందుగానే పారుపత్యదారు ఖచేరిలో హారతి ఒకటికి ఒక రూపాయ వంతున చెల్లించి రశీదు బొంది రశీదును లోపల స్వామివారి సమీపమున "తండు" వద్ద నున్న బ్రాహ్మణ యుద్యోగి (హార్కారా) చేతికిచ్చిన వెంటనే హారతి జరుగును.

శ్రీస్వామివారిని దర్శనము చేసుకొనుచుండు కాలములో స్వామి వారికి ద్రవ్యము సమర్పించవలయునని తోచినయెడల కులశేఖరపడివద్ద రూపాయ వేయుటకు మాత్రము రంధ్రముకలిగి సీలుచేయబడిన పెట్టెలో వేయించవలయును. ఈ విశ్వరూపదర్శనము యాత్రికులు జనస్తోమము ననుసరించి 2, 3 గంటలకాలము జరుగును.

3. శుద్ధి:— విశ్వరూపదర్శనమైనపిదప సుమారు ½ గంటకాలము గర్భాలయమున పాత్రలు, నట్టిల్లు, శుద్ధి చేయబడును. ముందు జరుగ వలసిన సేవకుగాను పాత్రల నాకాశగంగతీర్థముచే నింపియుంతురు. ఈ సమయమున పనిచేయుసేవకులు తప్ప యితరులు లోపలికి పోగూడదు.

4. తోమాల సేవ:— శుద్ధియైన వెంటనే తోమాలసేవ ప్రారంభ మగును. శ్రీవారి తిరువారాధనమును, పుష్పమాలా సమర్పణమును నీ సేవయందలి విశేషములు.

ఈ సేవచేయించగోరువారు శ్రీదేవస్థాన పారుపత్యదారు ఖచేరిలో (రూ. 13 లు) పదమూడు రూపాయలు చెల్లించి చీటి పుచ్చుకొనవల యును. చీటి 1-టికి సాధారణ దినములలో 5 మందియు బ్రహ్మోత్సవ, నవరాత్ర్యుత్సవములలో 4 గురును లోపలికిపోయి తోమాలసేవ దర్శ నము చేసుకొనవచ్చును.

ఆమంత్రణోత్సవము, బ్రహ్మోత్సవము జరిపించువారు యీ తోమాలసేవకు సాధారణముగ 10 మంది మొదలుకొని ఆ యా తరగతి

బ్రహ్మోత్సవముల ననుసరించి యెక్కువమందితో పోవచ్చును. ఇట్లు సొమ్ము చెల్లించు వారందరును సేవప్రారంభము మొదలు అంత్యము వరకు సుమారు ఒక గంటకాలము నిలిచి దర్శనముచేయుదురు. కాబట్టి యీ సేవ యందును అర్చన యేకాంత సేవలలో వలెనే ఒక్కొకప్పుడు అధిక జనసమ్మర్దముగానుండును.

ఈ సేవయందు శ్రీభోగ శ్రీనివాసమూర్తికి అభిషేకమగును. శ్రీమూలవర్ల పాదారవింద యుగళముయొక్క దర్శనము కలుగును.

శ్రీవారికి తిరువారాధనము జరిగినవెంటనే తోమాల సమర్పించ బడును. వేద పారాయణము దివ్యప్రబంధ పారాయణమును జరుగును. ఈ సమయమున గద్వాల్ రాజాగారి నేతి దీవిటీలు పట్టబడును. మైసూరు సంస్థానపు నౌకరులు చామర కైంకర్య మొనర్తురు.

ప్రబంధ పారాయణము ముగింపుకాబడిన వెనుక శ్రీవారి ప్రధమాచార్య పురుషులు మంత్ర పుష్పము తులసీ దళములతో సమర్పింతురు. సేవ అంత్యమున దేవస్థానపు హారతి అగును. పిదప గృహస్థుల హారతియు, టికెట్లు కొనియుండు వారి హారతులును జరుగును. హారతి అయిన వెంటనే యాత్రికులు బయటికి రావలెను.

5. కొలువు (దర్బార్):— తోమాలసేవ పూర్తిఅయినవెంటనే కొలువుశ్రీనివాసమూర్తివారు కులశేఖరపడినుండి వెండి కుర్చీలో దేవస్థానముయొక్క నేతిదివిటీలు ముందురాగా శఠారి సహితముగా బంగారు వాకిలిదాటి దానికి ముందుండు తిరుమహామణి ముఖమంటపమునకు విజయము చేయుదురు. ఈ సమయమున శ్రీమైసూరు మహారాజా వారిచే సమర్పింపబడిన బంగారు గొడుగును మహారాజా వారివల్ల నియమింప బడిన బ్రాహ్మణుడు బట్టును. కొలువునందు ఆసీనులైన శ్రీవారికి లఘువుగా ఆరాధనకై నువ్వులు వేయించి శొంఠిపొడిచేసి బెల్లము

కలిపి నివేదనయగును. 16 శేర్లు బియ్యము నూనె రూ. 0_2_0 ...ఖ్యము అర్చకునికి శ్రీవారు దానముచేయుదురు. శ్రీవారికి పంచాంగ శ్రవణము చేయబడి ముందు దినముయొక్క వరుంబడి చిఠా వినిపించబడును. తదనంతరము దేవస్థానపు స్వంత నవనీతహారతి అయి శ్రీశతారి ప్రసాదము స్థలక్రమానుసారము వినియోగమగును. పిదప శ్రీవారు లోనికి వేంచేయుదురు. ఈ కొలువు శ్రీవారి బ్రహ్మో త్సవ ధ్వజారోహణము నాటినుండి దీపావళినాటివరకు జరుగదు.

6. అర్చన (సహస్రనామావళి):— కొలువు అయిన 10 నిమిషములలోపల శ్రీవారికి తులసితో సహస్రనామ అర్చన ప్రారంభ మగును. పారుపత్యదారు కచ్చేరిలో రూ. 7_0_0 చెల్లించి అర్చన టికెట్టు 1 టికి సాధారణకాలములో 4 గురును బ్రహ్మోత్సవ నవరాత్రి ఉత్సవములలో 3 గురు వంతునను దర్శనమునకు పోవచ్చును. ఈ సేవ ప్రారంభమున బ్రహ్మోత్సవము, ఆమంత్రణ ఉత్సవము చేయించు గృహస్తులనున్ను, అర్చన టికెట్లు తీసినవారినిన్ని లోనికి వదలుదురు. టికెట్లులేనివారు విడువబడరు. ఒకొక్కప్పుడు జనస్తోమము అధికముగా నుండును. అట్టికాలమునందు జనులు సావధానముగా వరుసలుతీరి నిల్చియుండిన యెడల అందరికిని సేవ చక్కగానగును.

అర్చన ముగింపు అయిన వెంటనే అర్చన టికెట్లుకొని దర్శన మునకువచ్చిన గృహస్థులకు వారి గోత్రనామములతో ఆశీర్వాదము చేయబడును.

---

Note:- అర్చన తోమాలసేవకు, యేంకాత సేవకు టికెట్లు తీసినవారు వారు తమ అడ్రసును పారుపత్యదారు ఖచేరిలో వివరముగా చెప్పినయెడల సకాలమున దేవస్థాన నౌకరు వారుండుబసకు వచ్చి తెలియబఱచును. గృహస్థులు తమ విడుదులలో లేకపోయినను, ఆలస్యముచేసినను అర్చన నిలువదు. వారువారు జాగ్రత్తగా సకాలమును ఎదురుచూచుకొని తయారుగా నుండవలయును.

అనంతరము హారతి టికెట్లు యెవరైనను కొనియుండి సన్నిధిలో "హారత్రా" వద్దయిచ్చిన యెడల హారతి జరుగును. హారతి అయిన పిదప అందరును బయటికి రావలయును.

7. లఘుశుద్ధి:— అర్చన అయినవెంటనే గర్భగృహము శుద్ధి చేయబడును.

8. నివేదన (మొదటిగంట):— లఘుశుద్ధి అయిన వెంటనే "పోటు" అనువంటశాలనుండి నైవేద్యమునకు పక్వము చేయబడిన పదార్థముల గంగాళములను శ్రీవారి సముఖమునకు తీసుకొని పోవుదురు.

నివేదన యగుచుండగా బంగారు వాకిటికి దక్షిణ పార్శ్వమున నుండు రెండు గంటలును ప్రయోగింపబడును.

నివేదన అయినతోడనే గంటలు నిలుచును. అనంతరము జియ్యంగార్లు మొదలగు కైంకర్యపరులు శాత్తుమొఱకు లోపలికిపోయి ద్రవిడప్రబంధ పఠనము పూర్తిచేసి తీర్థప్రసాదములు స్వీకరింతురు. అటు తర్వాత ధర్మదర్శనమగును.

9. ధర్మదర్శనము:— సాధారణముగ ఇది గంట అయిన తోడనే సుమారు మధ్యాహ్నము 12 గంటలకుపైన 1 గంటకులోపల ప్రారంభమగును. దీనిని గంట దర్శనమనియు మధ్యాహ్న దర్శనమనియు చెప్పుదురు.

ఇది ప్రాతఃకాలమున జరుగు విశ్వరూపదర్శనమువలెనే ధర్మముగా జరుగును. దీనికి ద్రవ్యము చెల్లించవలసిన పనిలేదు. యెంత స్తోమ ముండినను నిదానముగా అందరిని ఒకరివెంబడి ఒకరిని కొంచము కొంచముగా లోపలికి వదలి, అందరికిని దర్శనమునకు అవకాశమిత్తురు. గనుక యెవ్వరును తొందరపడక సావధానముగా దర్శనము జేసికొనవలయును.

యాత్రికుల నాదరించువారివలె సంచరించు దళాలీలు అనేకులు గలరు. ముందుగా దర్శనము చేయింతుమనియు అనేక విధములుగా మోసపుచ్చు వారిమాటలు నమ్మి యెవరికిని ధర్మదర్శనమునకు గాను సొమ్ము యివ్వ వలసిన ఆవశ్యకత లేదు దేవస్థానమువారి మూలమున తప్ప మరి యెవ్వరి ద్వారాగాని తృప్తికరముగ దర్శనము చేయుటకు వీలులేదు.

ఈ ధర్మదర్శనకాలములో లోనికి పోవువారు తీర్థము శఠారి అయిన వెంటనే బయటికి రావలయును. అట్లు చేయనిచో తమవెనుక నుండు వారికి దర్శనము ఆలస్యమగుటయేగాక శ్రీస్వామివారికి మీాద జరుగ వలసిన పూజా నైవేద్యములకు ఆలస్యమగును. ఈ దేవాలయములో పూజావిధానము విరళముగా జరుగుట మిక్కిలి విశేషము. ఈ ధర్మ ధర్శనమగుచుండగా కొప్పెర లేక హుండి పరఖామణి జరుగును.

పరఖామణి:—— పారుపత్యదారు ఖచేరికి యెదురుగా మనిషి యెత్తు గొలుసులతో వ్రేలాడ కట్టబడి రెండు సీల్లుచేయబడియుండు బుర్కాగంగాళములో యాత్రికులు వేయుముడుపులను పారుపత్యదారు ఖచ్చేరిలో బహిరంగముగా సదరుహుండిని విప్పి కుమ్మరించి నాణెపు వారిగా యెంచి, నగలు బంగారు వెండి వేరువేరుగా యేర్పఱచి లెక్క వ్రాయించుట పరఖామణి అనబడును.

యాత్రికులు స్వామివారికి చెల్లించగోరు సొమ్ములను యీా హుండిలో వేసినను, తిరుపతిలో దేవస్థాన ఆఫీసులోనైనను, తిరుమల దేవస్థానములోనుండు పారుపత్యదారు ఆఫీసులోనైనను చెల్లించి రసీదు తీసికొన్నను శ్రీవారి సముఖమున కులశేఖరపడివద్ద రూపాయ పట్టునంతటి రంధ్రముగల సీలుపెట్టెలోవేసినను సొమ్ములు శ్రీవారికే చేరును. ఈ నాలుగు విధములు తప్ప యితరులచేతికిచ్చినయెడల ఆ సొమ్ము శ్రీవారికి చేరదు.

మధ్యాహ్నము 1 గంట మొదలు ఒకటి రెండు గంటకాలము పరఖామణి జరుగును. హుండీలో బడిన పైకమును సొమ్ములును ముల్లెలుకట్టి సీళ్లువేసి పారుపత్యదారు ఆఫీసులో హారతి, ఆర్జితసేవలు, వాహనములు, నైవేద్యములు వీనికై టికెట్లమూలమున చెల్లించబడిన పైకమును ముల్లెలు కట్టి సీళ్లుచేసి అన్నిటిని భద్రపరచి తిరుపతిలోనుండు శ్రీవారి ఖజానాకు మరునాడు పంపబడును.

10. శుద్ధి:— ధర్మదర్శనము జరిగిన పిమ్మట శ్రీవారి గర్భాలయము చక్కగా శుభ్రము చేయబడును. ఈ సమయమున కైంకర్యపరులు తప్ప మరియెవరును లోపలికి విడువబడరు.

11. రెండవ అర్చన—(అష్టోత్తర శతనామావళి):— మొదటి అర్చన కాలమున శ్రీవారికి సహస్ర నామావళితో అర్చన జరిగిన రీతిగనే యిప్పుడు (108) అష్టోత్తర శతనామములతో తుళసి అర్చన జరుగును. పారుపత్యదారు ఖచేరిలో రూ. 7—0—0 చెల్లించి రసీదు పొందువారు సహస్రనామ అర్చనలో చెప్పినరీతిగా ఈ సేవకును లోపలికి పంపబడుదురు.

12. రెండవ నివేదన(రెండవ గంట):— శుద్ధి అయిన తరువాత రెండవగంట మ్రోగింపబడుచు శ్రీవారికి ప్రసాదములు నివేదింపబడి శ్రీభాష్యకార్లకు మాత్రము శ్రీవారి ప్రసాదము ఆరగింపు చేయబడి బంగారు వాకిటి తలుపులు మూయబడును. అర్చకులు మొదలగు కైంకర్యపరులు తమ తమ బసలకు పోవుదురు. ఇది మొదలు రాత్రి ధర్మదర్శనకాలము వఱకును యాత్రికులు శ్రీవారి గర్భాలయము లోనికి పోవుటకు అవకాశములేదు. ఈ మధ్య కాలములో దేవస్థానము ఖచేరిలో సొమ్ము చెల్లించి యాత్రికులచే శ్రీవారికి చేయించబడు ఉత్సవములు యెండ చల్లబడి వర్షములేని కాలములో జరుపబడును.

13. రాత్రిపూజ:— సాయంసంధ్య వరకు జరుగవలసిన ఆర్జిత ఉత్సవములు అయిన వెనుక అర్చకులు సాయంస్నానము చేసికొని వచ్చి పారుపత్యదారు ఉత్తరవుపొంది బంగారు వాకలితీసి శుద్ధి, తోమాలసేవ, అర్చనలు యేకాంతముగా జరుగును. గనుక ఎవ్వరికిని దర్శనములేదు. ఇవి యైనవెంటనే రాత్రి ధర్మదర్శనము జరుగును.

14. ధర్మదర్శనము:— ఇది మధ్యాహ్నపు ధర్మదర్శనము విధముగా జరుగును. ధర్మదర్శనము అయిన వెంటనే హుండి (కొప్పెర) విప్పబడి అందలి సొమ్ము ప్రత్యేక సంచిలో వేయబడి సీళ్ళుచేసి భద్ర పరచబడును. కొప్పెర విప్పిన తరువాత గర్భాలయము శుద్ధిచేయబడి ఏకాంతసేవ (పానుపుసేవ) కు సిద్ధపఱచబడును. స్వామివారి శయ నార్థము మంచము వెండి గొలుసులతో జోడించబడి శ్రీపాదచందనము, పాలు, పండ్లు మొదలగునవి సన్నిధిలోనికి తీసికొని పోబడును. వెంటనే పారుపత్యదారు వుత్తరవు బొంది యితరులు యెవ్వరును గర్భాలయ ములో లేకుండజేసి అర్చకులు మాత్రము గర్భాలయములో నుండు శ్రీరాములవారి సన్నిధి అను రెండవ ఆవరణపు తలుపులు మూసి మంచముపై పఱచబడి యుండు వెల్వెటు పఱపు మీద శ్రీ భోగ శ్రీనివాస మూర్తి వారిని శయనింపజేసి పాలు పండ్లు వగైరాలను ఆరగింపు జేసి తలుపులు తీయుదురు.

15. (A) ఏంకాతసేవ:— శయనించి యున్న శ్రీవారి దర్శ నము ఏకాంతసేవ యనబడును.

పారుపత్యదారు ఖచేరిలో రూ. 13_0_0 లు చెల్లించి టికెట్టు పొందినవారు టికెట్టు 1-టికి సాధారణ దినములలో 5 మంది వంతునను బ్రహ్మోత్సవ నవరాత్రి ఉత్సవకాలములలో 4 గురు వంతునను ఆమం త్రణోత్సవ గృహస్థులు లెక్క ప్రకారము లోపలికి విడువబడుదురు.

ఇతరులకు ప్రవేశములేదు. ఏకాంతసేవకు లోపలికి పోవు యాత్రికులు బంగారువాకిలి దాటి స్వప్న మంటపము అను మొదటి ఆవరణములోనే నిలిచి యుండవలెను. అప్పుడు శ్రీవారి భక్తురాలగు తరిగొండ వెంకమాంబగారి పూర్వపు నియమముప్రకారము తేబడు ముత్యాల హారతి జరుగును. ఇతర హారతులు చేయరు. ఈ హారతి పళ్లెరములో ర్పూ. 1—0—0 వేయు యాత్రికులందరు యీ హారతిని చేయించినట్లు భావము. ఈ రూపాయలు వెంటనే డబ్బిలో వేయబడి యినుపపెట్టెలో భద్రపరచబడును.

హారతి అయిన తరువాత పాలు పండ్లు వినియోగము అగును. అనంతరము అందరును బయటికి పోవలయును.

ఈ యేకాంత సేవయందు శ్రీవారి పాదములందు సమర్పించబడిన చందనము మరుదినము దర్శనకాలములో యాత్రికుల వినియోగార్థ మొక భాగమును, అర్చకులకు కొంతయు ఖర్చు కాబడును. మిగిలినది పారుపత్యదారు ఖచేరికి తేబడి ధర్మార్థముగా యాత్రికులకు ప్రసాదముగా వినియోగింపబడును.

(B) తీర్మానము:— ఏకాంతసేవకు వచ్చిన యాత్రికులందరును బయటికి పోయినపిదప అర్చకులును జియ్యంగార్లును సన్నిధిలో దివిటీ పట్టు గొల్లయు లోపలనుండి తలుపులు వేసికొని శోధనచేసికొని బయటికి వత్తురు. సన్నిధిలోని కైంకర్యపరులు బంగారువాకిలి దాటి బయటికి వచ్చునపుడు అచ్చట నుండు హార్కారా, వారిని శోధనచేసి వదలును. అనంతరము బంగారువాకిలి తలుపులుమూసి బీగమువేసి మోహార్ చేయబడును.

పారుపత్యదారు మోహార్లను బీగములను తనికీచూచుకొనుచు గుడిప్రాకారముల లోపల నెవ్వరు లేకుండజేసి పహరా (కావలి) వాండ్రకు

దేవస్థానమును స్వాధీనముచేసి పడికావలి (ముఖద్వారము) తలుపులు వేయించి బయటికి వచ్చును.

ఈ ప్రకారము ప్రతిదినము ధర్మదర్శనములు విశేషదర్శనములు త్రికాలములయందును జరుగునుగాని, గురువారము రాత్రి మొదలు శుక్రవారము సాయంకాలము వరకు ధర్మదర్శనములు లేవు.

## (16) గురువారపూజాక్రమము

పూలంగిదర్శనము:— ప్రతి గురువారము నందును ప్రాతఃకాలము మొదలు మధ్యాహ్నము మొదటిగంట అయి ధర్మదర్శనము పూర్తియగు వరకును ఇతర దినముల వలెనే పూజాక్రమము జరుగును. పిదప శ్రీవారి తిరుమేనియందుండు తిరువాభరణములను తీసివేయుదురు.

శ్రీవారి నేత్రముల కప్పుచు తిరుముఖమండలమందు ప్రకాశించు పచ్చకర్పూరపు తిరునామమును సన్నముగా దిద్దుదురు. ఈ సమయమున సన్నని తిరుమణియు ధోవతి యుత్తరీయములు మాత్రమే శ్రీవారి యలంకారములు.

ఈ మార్పులైన పిదప శుద్ధి అయి శ్రీవారికి నిత్యము జరుగురీతి రెండవ అర్చనయు రెండవ గంటయు జరుగును. పిమ్మట తలుపులు మూయబడును.

సాయంకాలము తలుపులు తీసి శుద్ధిచేసినపిదప యమునత్తురై యనబడు పూల అరనుండి మేళతాళములతో తేబడు తోమాల పుష్పాలంకారములతోను, పూలజామ అను అంగీతోను శ్రీవారు అలంకరింపబడి తోమాలసేవ అర్చన నివేదనమై పూలంగి దర్శనము ప్రారంభమగును. ఇది ఆర్జిత దర్శనము. ధర్మదర్శనము కాదు. పూలంగి దర్శనము చేసికొనగోరువారు పారుపత్యదారు ఖచేరిలో మనిషి 1-కి 1 రూపాయ

వంతున కట్టి, చీటిపొంది దానిని బంగారు వాకిటివద్ద నుండు తనిఖీదార్ల వద్ద యిచ్చి లోపలికి పోవచ్చును. రూ. 60 లు చెల్లించి పూలంగి సేవ చేయించువారు పూలంగి దర్శనమునకు ప్రత్యేకముగా 1 రూపాయ వంతున యిచ్చి టికెట్లు కొనవలసినది లేదు. వారితోకూడ కొంత మందిని లెక్కప్రకారము ఉచితముగా వదలుదురు. ఈ సేవ మిగుల నేత్రానందకరమును మనోహరమునైనది. దీనికే పూలంగి యని పేరు.

పూలంగిసేవయైన పిదప శుద్ధియు, ఏకాంతసేవయు, తీర్మానము నగును.

## 17 శుక్రవారక్రమము.

అభిషేకము:— శుక్రవారం ఉదయమున తలుపులు తీసిన వెంటనే పూలంగిసేవతో శ్రీవారి విశ్వరూప దర్శనమగును. ఇది ధర్మ దర్శనముకాదు. గురువారము రాత్రివలెనే మనిషి 1 రికి 1 రూపాయ టికెట్లుకొని దర్శనమునకు పోవలెను. ఈ దర్శనమయిన తరువాత యీ అలంకారము తీసివేయబడును. పిదప యేకాంతముగా తోమాలసేవ, అర్చన, మధ్యాహ్నము గంట, అయి మరల అర్చనజరిగి శ్రీవారి అభి షేకమునకు తేబడిన పాలు లోపలికి తీసుకొని పోబడి పిదప శ్రీవారి పరిమళపు గదిలోనుండి అభిషేకార్థము పచ్చకర్పూరము కుంకుమపువ్వు మెదిగించి చేర్చిన చందనము, కస్తూరి, పునుగుతైలము వీనిని పారు పత్యదారును జియ్యంగార్లును అభిషేకము చేయించు గృహస్థులును మేళతాలములతో ధ్వజస్తంభమునకును, విమానమునకును శ్రీవారిగర్భా లయమునకును ప్రదక్షిణముగా లోపలికి తీసుకొనిపోవుదురు. అనంతరము పాలు, తీర్థము, చందనము తీర్థములతో అభిషేకము జరుగును.

ఈ అభిషేక దర్శనమునకు పారుపత్యదారు ఖచ్చేరిలో మనిషి 1 రికి 1 రూపాయ చెల్లించి టికెట్టు పొందువారును పులికాపు లేక

అభిషేకసేవకు సొమ్ము చెల్లించినవారును వదల బడుదురు. టికెట్లు తీసుకొన్నవారు అభిషేకము ప్రారంభము మొదలు అంత్యమువఱకును శ్రీవారిని దర్శనము చేసుకొనుచు నిలవబడియుందురు గనుక, యించుక జనస్తోమముగానుండును. యాత్రికులును ఒకరిపై నొకరు పడక తమలో తాము సవరించుకొని పంక్తిగా నిలిచి దర్శనము చేసికొనవలయును. ఈ అభిషేకము ఆరంభము మొదలు అంత్యమువరకును యాత్రికులు నిలిచియుండవలసియున్నందున పసిపిల్లలును వృద్ధులును యీ దర్శనమునకు పోవకయుండుట మంచిది.

శ్రీవారికిని తొలుత క్షీరాభిషేకమయి పిదప తీర్థముతో నభిషేకముచేసి, తరువాత నూరిన కేసరి కలిసిన చందనము సమర్పించి మఱియొక తూరి తీర్థముతో నభిషేకము చేయుదురు.

వెంటనే శ్రీవారికి సిరు తిరుమణి సమర్పించి పచ్చకర్పూరపు హారతియై నవనీతము తాంబూలము ఆరగింపగును. వెంటనే హారతి చీట్లు తీసినవారి హారతులైనతోడనే యాత్రికులు బయటికి వత్తురు. అటువెనుక శ్రీపాదరేణువు కలుపబడి రాబోవు శుక్రవారమువఱకు యాత్రికుల వినియోగార్థము పారుపత్యదారువారి ఆఫీసుకు తేబడును. అభిషేక తీర్థము యింటికి తీసుకొని పోవలయునని కోరిన యాత్రికులకు పారుపత్యదారు ఉచితముగ ధర్మదర్శనము కాగానే యిప్పింతురు.

అభిషేకానంతరము శ్రీవారికి వస్త్రాభరణములు అలంకారమగును. అటుతర్వాత (శ్రీవారి స్వర్ణ తాయార్లకు) అభిషేకము రహస్యముగా చేయబడును. ఈ సమయమున కైంకర్యపరులు తప్ప యితరులెవ్వరును పోకూడదు.

స్వర్ణ తాయార్ల అభిషేకమయిన తర్వాత ఆర్జిత దర్శనములగు తోమాలసేవ, అర్చన జరిగి రెండవగంటకాగానే శాత్తుముఱయయి ధర్మదర్శనము ప్రారంభమగును.

అనంతరము శుద్ధి, రాత్రి తోమాలసేవ అర్చన గంట అయి తీర్మానము మామూలు ప్రకారము జరుగును.

[N. B:—విశేషోత్సవ దినములయందు ప్రాతఃకాల విశ్వరూప దర్శనము గాని, రాత్రి ధర్మదర్శనము గాని కొన్ని సమయములలో నిలుపబడును.]

—(o)—

# అధ్యాయము 5

ఆర్జిత ఉత్సవములు, సేవలు, నివేదన:— యాత్రికులు తిరుపతిలో నుండు శ్రీదేవస్థానము ఖచ్చేరిలోగాని తిరుమల శ్రీవారి దేవాలయమునందుండు పారుపత్యదారు కచ్చేరిలోగాని సొమ్ము చెల్లించి రశీదుపొంది శ్రీవారికి ఉత్సవములు జరిపించవచ్చును. సేవలు చేయించవచ్చును. నివేదనలు సమర్పించవచ్చును. ఇవియే ఆర్జిత ఉత్సవములు, సేవలు, నివేదనలు.

(A) ఆర్జిత ఉత్సవములు:— మధ్యాహ్నము రెండవగంట అయిన తర్వాత యాత్రికుల ఆర్జిత ఉత్సవములు జరుగును. ఉత్సవములు చేయించువారు ఒక్కొకయుత్సవమునకు హారతికిగాను ఒక్కొక రూపాయ ప్రత్యేకముగా చెల్లించవలెను.

వీనికి చెల్లించవలసిన రేట్లు వివరము

| | | | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| 1. | 1_వ తరగతి బ్రహ్మోత్సవము | | ... | 1500 | 0 | 0 |
| | 2_వ ,, | ,, | ... | 750 | 0 | 0 |

| | | | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| 2 | వసంతోత్సవము | | ... | 2000 | 0 | 0 |
| 3. | కల్యాణోత్సవము | | ... | 500 | 0 | 0 |
| 4. | సర్వభూపాల వాహనము | (వజ్రకవచముసహా) | ... | 72 | 0 | 0 |
| 5. | ,, | (వజ్రకవచము లేక) | ... | 62 | 0 | 0 |
| 6. | కల్పవృక్షవాహనము | (వజ్రకవచము సహా) | ... | 72 | 0 | 0 |
| 7. | ,, | (వజ్రకవచము లేక) | ... | 62 | 0 | 0 |
| 8. | పెద్దశేషవాహనము | | ... | 62 | 0 | 0 |
| 9. | సూర్యప్రభ | | ... | 62 | 0 | 0 |
| 10. | పుష్పరథము | | .... | 62 | 9 | 0 |
| 11. | ముత్యపు పందిలి | | ... | 62 | 0 | 0 |
| 12. | బంగారు గరుడవాహనము | | ... | 62 | 0 | 0 |
| 13. | వెండి గరుడవాహనము | | ... | 32 | 0 | 0 |
| 14. | హనుమంత వాహనము | | ... | 32 | 0 | 0 |
| 15. | చిన్న శేషవాహనము | | ... | 32 | 0 | 0 |
| 16. | చంద్రప్రభ వాహనము | | ... | 32 | 0 | 0 |
| 17. | ఏనుగు వాహనము | | ... | 32 | 0 | 0 |
| 18. | గుఱ్ఱపు వాహనము | | ... | 32 | 0 | 0 |
| 19. | సింహ వాహనము | | ... | 32 | 0 | 0 |
| 20. | హంస వాహనము | | ... | 32 | 0 | 0 |
| 21. | వెండి తిరిచి | | ... | 32 | 0 | 0 |

1. **బ్రహ్మోత్సవము:—** శ్రీవారికి రెండవగంట అయిన తరువాత వెండి తిరిచిలో శ్రీవారికి వజ్రకవచము సమర్పణమై బ్రహ్మోత్సవము దత్తమగును. దత్తమైనది మొదలు 8 దినములలో 16 వాహనములు దేవస్థానము సౌకర్యముల ననుసరించి యితర యాత్రికులకు యిబ్బంది లేకుండునట్లుగా జరుగును. బ్రహ్మోత్సవమునకు చెల్లించిన సొమ్ముగాక దత్తకాలమందు ఒక రూపాయయు వాహనములు జరుగునప్పుడు ఒక్కొక్క హారతికి ఒక్కొక్క రూపాయయు గృహస్థుడు ప్రత్యేకముగా నియ్య

వలయును. ఇవియును దేవస్థానమునకే చేరును. వాహనములపై నుత్సవములు జరిగిన పిమ్మట తేరుకు బదులుగా శ్రీవారికి అరటిచెట్లు మామిడియాకుతోరణములు కట్టిన సర్వభూపాల వాహనములో నుత్సవము జరిపింతురు. దీనితో బ్రహ్మోత్సవము పూర్తియగును. అధిక బ్రహ్మోత్సవములందు ధ్వజారోహణముగాని అవరోహణముగాని, రథోత్సవముగాని జరుగదు. బ్రహ్మోత్సవము పూర్తి అయినరాత్రి వస్త్రమును తీర్థప్రసాదములును గృహస్థులకు బహుమతిచేసి వాద్యములతో వారిబసకు పంపెదరు. దత్తము మొదలు పూర్తియగువరకును బ్రహ్మోత్సవ గృహస్థుల తాలూకు మనుష్యులను తరగతినిబట్టి తోమాలసేవ, అర్చన, ఏకాంతసేవలకు వదలెదరు. మధ్యాహ్నము చిన్నగంగాళముతో పొంగలిప్రసాదమును, రాత్రి దోసెలును వారికి యివ్వబడును.

2. వసంతోత్సవము:— ఇది పదిరోజులు జరుగును. రెండవ గంట అయిన తరువాత ఉభయదేవుల సమేతము శ్రీవారికి ధ్వజస్తంభమునకు దక్షిణముననుండు తిరుమలరాయ మంటపములో తిరుమంజనమై అలంకారమయి వడపప్పు దధ్యోదనము నివేదనము చేయబడును. సంపంగి ప్రదక్షిణముగా శ్రీవార్లు ఉగ్రాణమునకు ముందుండు మంటపమునకు వేంచేసి అచ్చట శ్రీవార్లకు కుంకుమపువ్వు కలిపిన చందనము తాంబూలము సహా గోష్ఠికి వినియోగము చేయుదురు. అనంతరము నాలుగు వీథులలో నుత్సవము జరుపుదురు. ఇట్లు పది దినములు జరిగిన పిదప బ్రహ్మోత్సవములో వలె గృహస్థులకు బహుమాన మొసగుదురు.

3. కల్యాణోత్సవము:— ఈ యుత్సవమొక జాముకాలము జరుగును. శ్రీవారికి రెండవ గంట అయిన తరువాత ఉత్సవర్లు ఉభయ

దేవుల సహితము కళ్యాణ మంటపమునకు వేంచేసి అచట ఉత్సవము చేయించు గృహస్థులచే సంకల్పము చేయించి మంత్ర హోమ యుక్తముగా వాద్యములతో శ్రీవారలకు కల్యాణము జరిపించి లడ్డు, వడ, దోసె, అప్పము నాల్గు గంగాళముల ప్రసాదములు ఆరగింపై నాల్గు వీథులలో నూరేగింపు చేయుదురు. ఆరగింపైన ప్రసాదములు గృహస్థుల కియ్యబడును. కైంకర్యపరులకును, గోష్ఠికిని దక్షిణ యివ్వ బడును. గృహస్థుడు కచ్చేరిలో చెల్లించిన రూపాయలు గాక దత్తము నకు ఒక రూపాయయు, హారతికి ఒక రూపాయయు యివ్వవలెను. ఇవి తప్ప యితరమైన ఖర్చులేమియు చేయనవసరములేదు. ఈ యుత్సవానంతరము ఆర్జిత బ్రహ్మోత్సవములో వలెనే గృహస్థులు మర్యాదలతో తమ బసవరకు తీసికొని పోబడుదురు.

4. వాహనములు:— ఇవియు శ్రీవారికి రెండవ గంట అయిన పిదపనే జరుగును. వాహనమునకు చెల్లించవలసిన సొమ్ముతోడ హారతికై ఒక రూపాయయును పారుపత్యదారు ఖచ్చేరిలోకట్టి రశీదు పొందవలయును. ఒక్కొక్క వాహనమునకు యెందరుసొమ్ము చెల్లించి నను అందరికిని చేర్చి ఒకతూరి శ్రీవారిని వాహనముపై వేంచేపుచేసి వారువారు తెచ్చిన హారతులుజరిపి ఒక్కొక్క గృహస్థునికి ఒక వెండి బెత్తము చేతికిచ్చి శ్రీవారితోడ వాహనమును నాలుగు వీథులు మెరవణి చేయుదురు. వర్షము మొదలగు కారణములవలన వీథులందు ఉత్సవములు జరుగుటకు సాధ్యము కాకపోవునెడల గుడిలోపలనే వాహన ముంచి శ్రీవారిని వాహనముపై వేంచేపుచేసి గృహస్థుడు తెచ్చిన హారతియై తానే మూడుసార్లు శ్రీవారికి ప్రదక్షిణముచేసి నమస్కారము చేయగా ఉత్సవము పూర్తియగును. ఉత్సవము మొదలగువానికి సొమ్ము చెల్లించువారు ఆయా కాలములందు దేవస్థానాధికారులకు రశీదులు చూపించనియెడల ఆయుత్సవాదులు జరిపింప బడవు. గాన

యాత్రికులు రశీదులను భద్రపరచుకొని సకాలములో నొసగవలయును.

(B) ఆర్జితసేవలు:— శ్రీవారి సేవలు చేయించువారు యీ దిగువ వివరించియుండు ప్రకారము సొమ్ము చెల్లించవలయును.

| | | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|
| 1. | తోమాలసేవ | ... | 13 | 0 | 0 |
| 2. | ఏకాంతసేవ | ... | 13 | 0 | 0 |
| 3. | తుళసి అర్చన | ... | 7 | 0 | 0 |
| 4. | పూలంగి దర్శనము | ... | 1 | 0 | 0 |
| 5. | పూలంగిసేవ | ... | 60 | 0 | 0 |
| 6. | పులికాపు దర్శనము | ... | 1 | 0 | 0 |
| 7. | పులికాపుసేవ | ... | 450 | 0 | 0 |
| 8 | గంబూరగిన్నె (పచ్చకర్పూరము) | ... | 250 | 0 | 0 |
| 9. | పునుగు చట్టముగిన్నె | ... | 85 | 0 | 0 |
| 10. | కస్తూరి గిన్నె | ... | 50 | 0 | 0 |
| 11. | జాఫారాగిన్నె (కుంకమ పువ్వు) | ... | 65 | 0 | 0 |
| 12. | సహస్రకలశాభిషేకము | ... | 1500 | 0 | 0 |
| 13. | పురాతిరుప్పావడ | ... | 2000 | 0 | 0 |
| 14. | అరతిరుప్పావడ | ... | 1000 | 0 | 0 |
| 15. | కోవిలాళ్వార్ తిరుమంజనము | ... | 500 | 0 | 0 |
| 16. | ఆమంత్రణోత్సవము | ... | 100 | 0 | 0 |

ఈ సేవలపైకి తోమాలసేవ, అర్చన యేకాంతసేవలను గుఱించి యింతకుమునుపే చెప్పబడియున్నది. మిగిలిన సేవలు క్రింద వివరింపబడును.

1. ఆమంత్రణోత్సవము:— ఒక దినమున శ్రీవారికి జరుగు పూజా నైవేద్యముల నన్నియు యీ సేవచేయించు గృహస్థుడు చేయించినట్లు భావము. ఈ సేవకుగాను కట్టిన 100 రూపాయలు సొమ్ము గాక తోమాలసేవ ఆరంభసమయములో ఆమంత్రణోత్సవదత్తము

చేయునపుడు 1 రూపాయ యివ్వవలయును. సేవలకాలములో హారతి చేయించినయెడల హారతి 1-టికి 1 రూపాయటికెట్టు తీయవలయును.

ఆమంత్రణోత్సవము 1-టికి 10 మంది జనము వంతున తోమాల సేవ అర్చన యేకాంత సేవలకు వదలుటయే కాక మధ్యాహ్నము చిన్న గంగాళము పొంగలియు రాత్రి 30 దోసెలు యివ్వబడును. ఒక మనోహరము లేక ఒకవడ బహుమాన మియ్యబడును.

2. పూలంగిసేవ:— గురువారము సాయంకాలము జరుగు పూలంగి దర్శనమునకు టికెట్టు 1-కి 1 రూపాయవంతున తీసినవారిని వదలుదురని చెప్పబడి యున్నది గదా. శ్రీవారికి అందమైన నిలువు టంగీ తొడిగించి పుష్పహారములచే నలంకరించుటయే పూలంగిసేవ యనబడును. రూ. 60 లు చెల్లించి ఈ సేవ చేయించువారిని కొందరి తోడ టికెట్టు లేకయే పూలంగి దర్శనమునకు వదలి తీర్థప్రసాదముల నిచ్చెదరు.

3. పూలికాపుసేవ:— శుక్ర వారమునాడు శ్రీవారికి జరుగు అభిషేకము యింతకు మునుపు వివరింపబడి యున్నది. ఈ అభిషేకము సేవకే పుళికాపుసేవ అనిపేరు. శ్రీవారికి మేళతాళములతో పరిమళ వస్తువులను ధ్వజస్తంభ విమానములకు ప్రదక్షిణముగా తీసికొని పోవు నపుడు పూరా పుళికాపుసేవకు సొమ్ము చెల్లించిన వారిచేతికి గంబూరా (పచ్చకర్పూరము), జాఫరా (కుంకుమపువ్వు), కస్తూరి, పునుగు చట్టము యీ నాల్గు వస్తువులు గల గిన్నెలు గంబూరా మొదలగు వానికి ఒక్కొక్కటికి మాత్రము సొమ్ము చెల్లించిన వారిచేతికి ఆయా పరిమళ ద్రవ్యము మాత్రముగల గిన్నెయును యిచ్చి వీరినిన్ని శ్రీవారి దేవాలయములోనికి పిలుచుకొని పోవుదురు. పుళికాపుసేవ చేయించు

వారితో పులికాపుదర్శనమునకు టికెట్టు లేకనే వీరితో కూడ ఆచార ప్రకారము కొందఱిని వదలుదురు. అభిషేకానంతరము వీరికి తీర్థ ప్రసాదము లొసగుదురు.

4. పూరా తిరుప్పావడ:— కొన్ని బస్తాల బియ్యము వంట చేసి బంగారు వాకిటి ముందు రంగ మంటపములో చేర్చి నివేదన యయిన తర్వాత నచ్చట గృహస్థుని వలన సంకల్పముతో దత్తము చేయించెదరు.

5. అర తిరుప్పావడ:—ఇదియు పూరా తిరుప్పావడ వలెనే జరుగును. కాని కుంభము మాత్రము సగము సామానులతో తయారు చేయబడును.

6. కోవిలాళ్వార్ తిరుమంజనము:— ఉదయము తోనే మొదటిగంట జరిగి గర్భాలయములోని అఖండములుంచు సెమ్మెలు మొదలగునవి బయటికితీసి శుద్ధిచేసి గోడలపై కప్పు మొదలగు వానికి కుంకుమ కర్పూరము చందనము మొదలగునవి కలిపి పూయుదురు. ఇదినాల్గుగంటలకు ముగియును. తరువాత రెండవగంటయై గృహస్థులు వస్త్రబహుమానము పొంది వాద్యములతో వెళ్లిన పిదప ధర్మదర్శన మారంభ మగును.

7. సహస్ర కలశాభిషేకము:— ఉదయము 8 గంటలకే మొదటిగంటయై 1008 వెండికలశములతో మంత్రపూర్వకముగాను హోమయుక్తముగాను శ్రీవారి రంగమంటపములో శ్రీభోగ శ్రీనివాస మూర్తికిని, శ్రీయుత్సవరులకును, శ్రీ సేనాధిపతి వారికిని అభిషేకము జరుగును. శ్రీ భోగ శ్రీనివాసమూర్తికిని శ్రీమూల వరులకును పట్టు సూత్రముచేత సంబంధము కలిగియుండును. ఈ సహస్ర కలశాభిషేక

మునకు మాత్రము శ్రీ భోగ శ్రీనివాసమూర్తివారు బంగారువాకిటి బయటవిజయము చేయుదురు.

C ఆర్జిత నివేదనములు:— ఆర్జిత నివేదనలు, చెఱుపులు, పళ్లు అని రెండువిధములు. శ్రీ వారికి ప్రసాద పణ్యారములు నివేదన చేయుంచ వలయునని కోరు యాత్రికులు ఉదయము 8 లేక 9 గంటల లోగా క్రింద కనియుండు ప్రకారము పైకమును పారుపత్యదారు కచ్చేరిలో కట్టి రసీదు పొందిన యెడల ఆ యా ప్రసాద పణ్యారములు సకాలమునకు తయారుకాబడి శ్రీవారికి నివేదనమగును. స్థలాచార ప్రకారము నివేదింపబడిన ప్రసాదములలో కొంచెము యెత్తు కొనబడి మిగిలినవి సొమ్ము చెల్లించిన గృహస్థుల కొసగబడును. పణ్యారములు 30 ఇవ్వబడును.

## 1. చెఱుపులు ప్రసాదములు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | దధ్యోదనము | ... | రూ. | 56 | 0 | 0 |
| 2. | పుళిహోర | ... | ,, | 60 | 0 | 0 |
| 3. | పొంగలి | .... | ,, | 70 | 0 | 0 |
| 4. | చక్కెర పొంగలి | ... | ,, | 80 | 0 | 0 |
| 5. | సాకర్ భాత్ | ... | ,, | 120 | 0 | 0 |
| 6. | కేసరి భాత్ | ... | ,, | 125 | 0 | 0 |
| 7. | పాయసము | ... | ,, | 80 | 0 | 0 |
| 8. | శీరా | ... | ,, | 160 | 0 | 0 |

## పళ్ల పణ్యారములు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | చక్కెరలడ్డు | ... | రూ. | 125 | 0 | 0 |
| 2. | జిలేబి | ... | ,, | 125 | 0 | 0 |
| 3. | వడ | ... | ,, | 80 | 0 | 0 |
| 4. | మనోహరము | ... | ,, | 70 | 0 | 0 |
| 5. | అప్పము | ... | ,, | 60 | 0 | 0 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 6. | పోళి | ... | రూ. | 45 | 0 | 0 |
| 7. | తేన్ తోళ | ... | ,, | 55 | 0 | 0 |
| 8. | సుఖియ | ... | ,, | 60 | 0 | 0 |
| 9. | దోసె | ... | ,, | 50 | 0 | 0 |
| 10. | ఊకాయ పచ్చడి | ... | ,, | 5 | 0 | 0 |

ఊకాయ పచ్చడికి చెల్లించిన ర్పూ. 5_0_0 గాక కాయలు గృహస్థు డియ్యవలయును. ఒక గూనపచ్చడి ఆరగింపు జేసి యిత్తురు.

ఇంత ద్రవ్యము సెలవుచేసి శ్రీవారికి నివేదనము చేయుటకు శక్తి లేని యాత్రికులు కలకండ, కొబ్బెర, ముంతమామిడిపప్పు, బాదంపప్పు మొదలగువానిని కొని యావస్తువుల క్రయమునకు సరియైన మొత్తమును పారుపత్యదారు కచ్చేరిలో చెల్లించి రసీదు తీసికొని బంగారు వాకిటివద్ద నున్న బ్రాహ్మణుని వశమున నిచ్చినయెడల నాతడు నివేదన చేయించి ప్రసాదమిచ్చును. ర్పూ. 0_4_0 లకు తక్కువలేక సుంకము చెల్లించ వలయును. శ్రీవారి అఖండములో నెయ్యి పోయుటకును నగలు వస్త్రములు మొదలగునవి సమర్పణ చేయుటకును యిదే పద్ధతి.

D నిత్యహారతులు:— తమ సేవగా గృహస్థులకు శ్రీవారికి ప్రతిదినమును కర్పూర మంగళ హారతి జరిపించుటకుగాను ర్పూ. 21 లును నిత్య నవనీత హారతి జరిపించుటకుగాను ర్పూ. 42 లును దేవస్థానములో వర్తన చెల్లించి మొదటి సంవత్సరమునుండి ప్రతి సంవత్సరమును యీ మొత్తములను దేవస్థానకచేరికి పంపినయెడల దేవస్థానమువారే వానిని జరుపుదురు.

E నిత్యార్చన:— శ్రీవారికి నిత్యార్చన చేయించ గోరువారు దేవస్థాన కచ్చేరిలో రూ. 42 లును చెల్లించవలయును. తులసి మొదలగు ఖర్చులను సంవత్సరం 1_టికి 42 ర్పూ. లును వంతున మొదటి సంవత్సరము చెల్లించి దేవస్థానము మూలముగా జరిపించ వచ్చును.

F దేవస్థానపు మేళము:— తిరుమలలో వివాహాది శుభ కార్యములు జరుపుకొను యాత్రికులు వాద్యములుకావలసి యుండిన యెడల పారుపత్యదారుని కచ్చేరిలో ర్వూ. 5_0_0 చెల్లించి మేళమునకు టికెట్టు పొంది టికెట్టును మేళగాండ్రకు చూపించి తాముదిగియుండు బసయును మేళము కావలసిన సమయమును తెలిపిన యెడల మేలగాండ్రు వచ్చి వాయించి టికెట్టు వాపసు పుచ్చుకొని పోవుదురు. ఒకదినమున అనేక యాత్రికులిట్టి టికెట్లు కొనుటవలనను శ్రీవారి కార్యములకు భంగము లేకుండా నుండవలసి యున్నందునను వాద్యగాండ్రు సమయోచితముగా సకాలమునకు కొంచము హెచ్చు తక్కువగా వచ్చినయెడల ఓర్చుకొని చాలకాల ముంచుకొనక యాత్రికులు పంపివేయవలయును. మేళము సకాలమునకు రాలేదనియు చాలకాలము నిలిచి వాయించలేదనియు పిర్యాదు చేయకూడదు

G చక్రాంకితము:— ఎవరైనను శ్రీవారి దేవస్థానములో చంక్రాంకితము చేసికొనవలెనని కోరినవారు మనిషి 1 రికి ర్వూ. 0_12_4 వంతున పారుపత్యదారు కచ్చేరిలో చెల్లించిన యెడల శ్రీవారి దేవస్థానములోని ముద్రామండపమున నొక వైష్ణవ బ్రాహ్మణునిచే వారికి చక్రాంకితము గావింపబడును.

---

# అధ్యాయము 6

## పక్షోత్సవ మాసోత్సవ వర్షోత్సవ విశేషోత్సవాదులు

శ్రీవారి దేవస్థానమునందు శ్రీవారికిని యితర దేవతలకును జరుగుచుండు పక్షదిట్టములు నక్షత్రదిట్టములు విశేషోత్సవములు ఆస్థానములు యిందు వివరింపబడును

## I పక్షదిట్టము.

ప్రతియేకాదశి మూలవరులకు గాక యితర మూర్తులకు తిరుమంజనము జరుగును. ద్వాదశులందును బహుళైకాదశులందును విశేషనివేదనమైన దధ్యోదనము నివేదింపబడును.

## II మాసోత్సవములు.

1. శ్రవణ నక్షత్రం:— ఇది శ్రీవారి జన్మనక్షత్రము. ఈ దినమున శ్రీఉత్సవరులకు, తాయారుల సహితము తిరుమంజనమై శ్రీవారికి 2-వ గంట అయినవెంటనే విశేష వస్త్రాభరణాలంకృతులై బంగారు తిరుచిలో నాలుగువీధుల నతి విభవముగా మెరవణియై దేవస్థానములో బంగారు వాకిటి కెదురుగ నుండు రంగమంటపములో వేంచేయుదురు. చక్కెర పొంగలి, శుండలి (సెనగలు) దోసెలు ఆరగింపయి గోష్ఠి వినియోగమగును.

2. రోహిణి నక్షత్రము:— ఇది శ్రీకృష్ణస్వామివారి జన్మనక్షత్రము. శ్రీవారికి 2-వ గంటయైన వెంటనే శ్రీరుక్మిణీ సమేతము శ్రీకృష్ణస్వామి వారికి నాల్గువీధులయందు ఉత్సవములు జరుగును. అనంతరము రంగమంటపములో పొంగలి శుండలి ఆరగింపై వినియోగమగును.

3. ఆర్ద్రా నక్షత్రము:— ఇది శ్రీవైష్ణవ మతస్థాపకులగు శ్రీ మద్రామానుజాచార్యులను శ్రీ భాష్యకారుల తిరునక్షత్రము. ఈ రోజున శ్రీవారికి 2-వ గంట అయిన పిదప తాయార్లతో శ్రీఉత్సవర్లు వెండి తిరిచ్చిలో విజయముచేసి శ్రీభాష్యకారులు తమకెదురుగ నొక తిర్చిలో వేంచేయుచుండగా తిరువీధులందు వుత్సవము జరుగును.

పిదప శ్రీభాష్యకార్ల గుడి ముందుమంటపములో శ్రీవారు విజయముచేసి యుండగా పొంగలి, శుండలి ఆరగింపయి గోష్ఠి వినియోగమగును. అనంతరము శ్రీవారు తాయార్లతో సన్నిధిలోనికి వేంచేయుదురు.

4. పునర్వసు నక్షత్రము:— ఇది శ్రీరాములవారి జన్మ నక్షత్రము. ఈ దినమున శ్రీ సీతా లక్షణ హనుమత్సహితము శ్రీరాముల వారికి ఉత్సవము జరుగును. పూర్వము శ్రీహత్తీరాంజీ మఠ అధికారిగా నుండిన శ్రీరామ లక్ష్మణ దాస్‌జీవారు దేవస్థానములో నీయుత్సవము శాశ్వతముగా జరుగునట్లు సొమ్ముకట్టి యున్నందున జరుగుచున్నది.

శ్రీరాములవారు పడమటి వీధిలోని వసంత ఉత్సవం తోటలో మంటపములో వేంచేసి ఆరగింపు వినియోగము జరిగిన పిదప మహా ప్రదక్షిణముగ నాల్గు వీధులలో మెరవణి అయి గుడి లోనికి వేంచేయుదురు.

5. ఉత్తరాభాద్రా నక్షత్రము:—ఇది మైసూరు మహారాజుగారి జన్మనక్షత్రము. పగలు 2-వ గంట అయిన తరువాత ప్రతి ఉత్తరాభాద్రా నక్షత్రమునాడును శ్రీవారికి శ్రీమైసూరు మహారాజాగారిచే సమర్పింపబడిన దంతపు పల్లకియందు ఉభయ దేవుల సమేతముగా శ్రీవారికి ఉత్సవము జరిగి రంగమంటపమునందు పుళిహోర ఆరగింపై వినియోగమగును.

6. ద్వాదశి యుత్సవము:— శ్రీవారికి 2-వ ఘంట అయిన తరువాత శ్రీవారు వెండితిరిచిలో మహాప్రదక్షిణముగ నుత్తరపు వీధిలో శ్రీ గద్వాల రాజాగారి ద్వాదశి మంటపమునకు వేంచేసి అచ్చట శ్రీ రాజాగారి యేజంటు చేయించిన పుళిహోర సెనగపప్పు నివేదింపబడి వినియోగింప బడును. అనంతరము శ్రీవారు ఆలయమునకు వేంచే యుదురు. ఇది గద్వాలరాజాగారి ధర్మము.

7. వసంతోత్సవము:— ప్రతి సంవత్సరము వసంతఋతువులో దేవస్థానము సెలవుతో వసంతోత్సవము అతి విభవముగా మూడు దినములు జరుగును. 3-వ రోజు శ్రీవారికిని సీతా లక్ష్మణ హనుమత్సమేత శ్రీరాములవారికిని శ్రీకృష్ణస్వామివారికిని ఉత్సవము జరుగును.

8. సురపురమువారి ఉత్సవము:— ఇది సురపురము రాజాగారు ప్రతిసంవత్సరము చెల్లించు పైకముతో ప్రతి రెండవనెలలో శ్రవణ నక్షత్రమునాడు సింహ వాహనముపై శ్రీవారికి ఉత్సవమును మృగశిర నక్షత్రమునాడు హంసవాహనముపై శ్రీవారికి ఉత్సవమును జరుగును.

## III విశేషోత్సవములు: ఆస్థానములు

(1) సంవత్సరాది ఆస్థానము :— ఇది ప్రతి సంవత్సరమును తెలుగు సంవత్సరాది దినమున జరుగును. ప్రతి దినమును మధ్యాహ్నము 12 గంటలకగు నివేదన యీరోజున ఉదయ మైదుగంటలకయి శ్రీమలయప్పస్వామివారు (ఉత్సవమూర్తి) శ్రీ ఉభయదేవులతో బంగారు వాకిటికి ముందుండు మంటపమున సర్వభూపాల వాహనమునందు ఆసీనులై వజ్రకవచము రఘూజీభాఁస్లే మొదలగువారు సమర్పణచేసిన విశేష తిరువాభరణములతోను పుష్పమాలలతోను అలంకరింపబడి విశేష నైవేద్యములతో 2-వ ఘంటయైన తరువాత శ్రీమూలవరులకును శ్రీ ఉత్సవరులకును నూతన వస్త్రధారణ మగును. ఆస్థానమున దేవస్థాన ప్రధానోద్యోగులు కూర్చుందురు. శ్రీవారికి నూతనపంచాంగ శ్రవణమయి పంచాంగము గణించినవారికిని పంచాంగము పఠనచేసిన వారికిని శాల్వాలు బహుమతి యొసగబడి గోష్ఠికి ప్రసాదములు వినియోగింపబడును. ఆస్థానము మధ్యాహ్నము 11, 12 గంటలకు పూర్తియైన వెనుక ధర్మ దర్శనమగును.

(2) నిత్యోత్సవము :— ఇది సంవత్సరాది మొదలు 40 దినములు జరుగును. సంవత్సరాది దినమున ఆస్థానాలంకారములతో తాయార్ల సహితుడుగను, మిగిలిన రోజులందు శ్రీవారు మాత్రమును వెండితిరిచిలో బహువిధవాద్యములతో వేదప్రబంధ పారాయణములతో తిరువీధులందు చుట్టివచ్చెదరు. ఈ 40 రోజులును ఉత్సవము జరిగిన వెంటనే శ్రీభాష్యకారులవారి ముఖమంటమునందు బకాళాబాత్ బెల్లము సెనగపప్పు ఆస్థానమగును.

(3) ఆనివరఆస్థానము :—ఇది ప్రతి సంవత్సరమును ఆడినెల (ఆషాఢమాసము) 1-టవ తేదీన దక్షిణాయన పుణ్యకాల దినమున జరుగును. సంవత్సరాది యాస్థానములో వలెనే శ్రీవారు రంగమంటపమునందాసీనులగుదురు. శ్రీవారి పాదమువద్ద నుంచబడిన దేవస్థాన బీగములను మొహర్లను అర్చకులు జియ్యంగార్లు దేవస్థాన ప్రధానోద్యోగి వీర్లకు అప్పగింతురు. పిదప ప్రసాద పణ్యార వినియోగములతో ఆస్థానము సమాప్తమై ధర్మదర్శనమగును.

(4) దీపావళి యాస్థానము :— ఇది దీపావళినాడు జరుగును. ప్రతి సంవత్సరము బ్రహ్మోత్సవమున అంకురార్పణ మంటపపు యాగశాలకు వేంచేసిన మూర్తులీదినమున గర్భగృహములోనికి వేంచేయుదురు. శేషించిన అన్నివిషయములు యితర ఆస్థానములరీతి జరుగును.

1, 3, 4 పెద్ద ఆస్థానములుగాక శ్రీరామనవమి, గోకులాష్టమి, కైశిక ద్వాదశి యీ దినములలో చిన్న ఆస్థానములు జరుగును.

(5) తెప్పోత్సవము :— ఇది తొలుత విజయనగర రాజగు సాలువ నరసింహ భూపాలుని ధర్మముగా జరిపింపబడుచున్నట్లు శాసనములచే తెలియవచ్చుచున్నది. కాని యిప్పటికి బహుకాలముగా నిలిచి

పోయియుండి యిటీవల కొన్ని సంవత్సరములకు ముందు ప్రారంభింపబడి ప్రతి సంవత్సరము ఫాల్గుణశుద్ధమందు జరుగుచున్నది. ఇది చూచుటకు మిక్కిలి రమణీయముగా నుండును.

(6) బ్రహ్మోత్సవము :— ఇది ప్రతి సంవత్సరమును నవరాత్రులయందును చాంద్రమానము రీతిగా అధికమాసము వచ్చినపుడు భాద్రపదసమాసమునందును జరుగును.

మొట్టమొదట బ్రహ్మచే యీ యుత్సవము యేర్పాటుచేయబడి జరిపింపబడినందున దీనికి బ్రహ్మోత్సవమని పేరు వచ్చినది.

తొల్లి దశరథమహారాజు పుత్రార్థము పుత్రకామేష్టి యాగము జరుపుటకు ముందు తన కులగురువగు వసిష్ఠుల యనుమతి గైకొని వెంకటాద్రికి వచ్చి స్వామి పుష్కరిణి తీరమున తపోనిష్ఠయందుండ శ్రీనివాసమూర్తి దశరథునికి ప్రత్యక్షమైరనియు ఆసమయమున శ్రీవారి దివ్యదర్శనార్థము వచ్చియుండిన సకల దేవతలయొక్కయు మహర్షి సంఘములయొక్కయు సమక్షమున బ్రహ్మచే ప్రార్థితుడై శ్రీనివాసుల వారు ఉత్సవము చేయించుకొనుటకు అంగీకరించిరనియు ధ్వజారోహణ పూర్వకముగ బ్రహ్మయే యీ యుత్సవమును జరిపించిరనియు శ్రీవేంకటాచల మాహాత్మ్యమున కనియున్నది. ఈ యుత్సవ వైభవము జూచి యానందించుటకై బ్రహ్మచే వెంకటాద్రికి పిలువబడి వచ్చిన సర్వ దేవతలును రాజులును మఱియు,

"బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాశ్శూద్రాశ్చాన్త్యజనాస్తథా
నానాజాతి సముత్పన్నాః సముద్ర వనవాసినః ॥"

అను శ్లోకమునందు పేర్కొనబడిన వారును మాటిమాటికి గోవిందనామ సంకీర్తన ఘోషముచే దశదిశలు పిక్కటిల్ల జేసిరనియు శ్రీ వేంకటాచల మాహాత్మ్యమువలన తెలియవచ్చుచున్నది.

పిదప చరిత్రకాలమందు క్రీ. శ. 10-వ శతాబ్దాంతమున నీ బ్రహ్మోత్సవముతో కూడ ఆడినెలయందు మఱియొక బ్రహ్మోత్సవమును జరుగునట్లు సామావై అను నొక పల్లవవంశ రాణిగారు యేర్పాటు చేసినట్లును పిదప క్రీ. శ. 1300 ప్రాంతమున శ్రీవారికి ప్రతి సంవత్సరము మార్గళినెలలో నింకొక బ్రహ్మోత్సవమును క్రీ. శ. పదునారవ శతాబ్ద మధ్యకాలమున తిరుపతి గోవిందరాజస్వామివారికి అప్పటికి జరుగుచుండిన ఉత్సవమాసములు వైయాసి, ఆని, ఈ రెండునెలలు తప్ప తక్కిన 10 నెలలలోను నెల 1-టికి ఒక బ్రహ్మోత్సవము వంతున 10 బ్రహ్మోత్సవములు శ్రీవారికి జరుగుచుండినట్లు శాసనములవలన యేర్పడుచున్నది. కాని యేకారణము వలననో అవి లుప్తమై నేటికి తొలుత వివరింపబడిన ఒక బ్రహ్మోత్సవము మాత్రమే జరుగుచున్నది.

## బ్రహ్మోత్సవక్రమము

**అంకురార్పణము** :— ఉత్సవ ప్రారంభ దినమునకు ముందు నాడు అంకురార్పణము జరిగి రాత్రి శ్రీవారి గర్భాలయములో శ్రీ మూలవర్లను శ్రీ భోగమూర్తియుఁ దప్ప నితరమూర్తులను కల్యాణ మంటపము లోనికిని యాగశాలలోనికిని విజయము చేయించి దీపావళి యాస్థానమువరకు నచ్చటనే వేంచేపు చేయించి యుంచుదురు.

ఈ దినము రాత్రి నివేదన ఘంటకుముందు శ్రీ సేనాధిపతుల వారికి నాలుగు వీధుల నుత్సవము జరిగి తిరుమలరాయ మంటపమున నాస్థానము జరిగి రాత్రి ఘంటయై తీర్మానమగును. శ్రీవారికి జరగనున్న బ్రహ్మోత్సవమునకు యేర్పాటులన్నియు సిద్ధముగ నున్నవా యని పరీక్షించుటకును మృత్సంగ్రహణార్థమును నీయుత్సవము జగురుచున్నదని భావము.

## మొ ద టి ది న ము

### 1. ధ్వజారోహణము, 2. పెద్ద శేషవాహనము.

ఈదినము విశ్వరూపదర్శనము, తోమాలసేవ, అర్చన ఘంటయయి శాత్తుమొఱకు ముందుగనే శ్రీవారిని ఉభయదేవుల సహితముగ బంగారు తిరిచిలో విశేష తిరువాభరణాలంకార మొనర్చిన యనంతరము మంత్ర యుక్తముగ కొన్ని యాగయుక్తక్రియలు జరిగినపిదప ఆర్జిత బ్రహ్మోత్స వము చేయించిన గృహస్థులకు దేవస్థాన ప్రధానోద్యోగులు దగ్గర నుండి సంకల్పపూర్వకముగ దత్తముచేయించి శ్రీ మూలవరుల యనుమతి కొఱకు సన్నిధిలోనికి వెళ్ళి యచ్చటనుండి యర్చకులు మంత్రముతో బలి సాయించుచు ఉత్సవమూర్తికి ముందుగ వెళ్లెదరు. ఇట్లు నాల్గు వీధులును ఉత్సవమైన తఱువాత ధ్వజపటమునకు ధ్వజస్తంభమువద్ద పూజ జరిగి నివేదనమై ధ్వజమును స్తంభముపై నెక్కింతురు. తిరుమల రాయ మంటపములో నాస్థానమై శ్రీవారు లోపలికి వేంచేసిన పిదప రెండవ ఘంట యగును. వెంటనే తోమాలసేవ అర్చన రాత్రి ఘంటయై శ్రీవారికి పెద్ద శేషవాహనోత్సవము జరుగును. ఉత్సవమై ఆస్థానానంత రము శ్రీవారు లోపలికి విజయము చేయుదురు. పిదప తీర్మానముచేసి తలుపులు వేయబడును.

**రెండవదినము :—** 1. మధ్యాహ్నము మొదటి ఘంటయైన తఱువాత చిన్న శేషవాహనము.

2. రాత్రి నివేదన ఘంటయైన తరువాత హంస వాహనము జరుగును. మొదటిరోజు మొదలు తొమ్మిది దినములు దినమున కొక్క ధర్మదర్శనము మాత్రము జరుగును.

**మూడవదినము :—** 1. పగలు సింహవాహనము.

2. రాత్రి ముత్యపు పందిలియను వాహనము (ఉభయ దేవుల సహితము).

**నాల్గవదినము** :— 1. పగలు కల్పవృక్ష వాహనము.

2. రాత్రి సర్వభూపాలవాహనము. (రెండును ఉభయదేవుల సహితము).

అయిదవదినము :— 1. పగలు మోహిని యవతారము. పాలకీ ఉత్సవము.

2. రాత్రి గరుడవాహనము.

ఆర**వదినము** :— 1. పగలు **మొ**దటి ఘంటయైన తరువాత **హను**మంత వాహనము. రెండవఘంట అయినపిదప వసంతోత్సవము.

2. రాత్రి ఏనుగు వాహనము.

ఏడ**వదినము**:— 1. పగలు సూర్యప్రభ వాహనము.

2. రాత్రి చంద్రప్రభ వాహనము.

ఎనిమిదవ దినము :— ఈ దినమున నుదయాత్పూర్వమే మొదటి ఘంటయైన పిమ్మట శుభముహూర్తమున శ్రీవారు అమ్మవార్లు సహితము రథారూఢులగుదురు. రథము నాలుగు వీధులలోను తిరిగి యథాస్థానము వచ్చినపిదప శ్రీవారు సన్నిధికి వెళ్ళగా 2-వ ఘంట యగును. వెంటనే రాత్రి ఘంటయైన తరువాత గుఱ్ఱపువాహనము జరుగును. శ్రీవారి బ్రహ్మోత్సవములో సహితము గురువారము రాత్రియు, శుక్రవారము విశ్వరూప దర్శన కాలమునను, అభిషేక సమయమునను యెప్పటివలెనే ధర్మదర్శనములేక, మనిషి 1-కి 1 రూపాయ టికెట్టు తీసికొని లోనికి పోవలెను.

తొమ్మిదవదినము:— 1. పాలకీవుత్సవము. 2. చూర్ణాభిషేకమనెడి తిరిచి యుత్సవము. ఈ రెండును శ్రీవారికి మొదటి ఘంటయయిన తరువాత ఉదయము 7 ఘంటలలోపల పూర్తి యగును. తిరిచి యుత్సవానంతరము శ్రీవరాహస్వామివారి సన్నిధిలో ఉభయ నాచ్చియార్ల సమేతను శ్రీవారికిని, చక్రత్తాళ్వార్లకును తిరుమంజనము జరిగి చక్రత్తాళ్వార్లకు మాత్రము పుష్కరిణిలో స్నానమయిన తరువాత శ్రీవారు లోపలికి విజయముచేయగా శాత్తుమొరయయిన పిమ్మట ధర్మదర్శనమగును.

రాత్రి బంగారు తిరిచి యుత్సవమైన పిదప ధ్వజావరోహణము జరుగును.

7. నవరాత్ర్యుత్సవము:— చాంద్ర మానము రీతిగా అధిక మాసము వచ్చినపుడు శ్రీవారి బ్రహ్మోత్సవము భాద్రపద మాసములో జరుగును. నవరాత్రులయందు ధ్వజారోహణావరోహణములును తేరును మాత్రము లేక మిగిలిన యుత్సవములు బ్రహ్మోత్సవములో వలెనే నవరాత్ర్యుత్సవములోను జరుగును.

నవరాత్ర్యుత్సవములో ప్రతిదినము ఆస్థానము తిరుమలరాయ మంటపములో జరుగక రంగనాయక మంటపములో జరుగును.

8. ధనుర్మాసము: — ధనుర్మాసమున అనగా మార్గళినెలలో జేయుపూజకు ధనుర్మాస పూజయందురు. ఇతర మాసములయందు ప్రాతఃకాలమున శ్రీవారికి సాధారణముగా జరుగు పూజాక్రమమున కంటెను యీ నెల 30 దినములు జరుగు పూజ మహిమాతిశయము కలది.

ఈ నెలలో ఉదయమున మామూలు సుప్రభాత శ్లోకములను పఠించుటకు బదులుగా ద్రావిడ ప్రబంధ పారాయణముతో బంగారు వాకిలి తీయుదురు. వెంటనే తోమాలసేవయు, బిల్వార్చనయు యేకాంతముగా కాగానే నివేదనఘంట యగును. అనంతరము శుక్రవారము ఉదయమున దప్ప యితర దినములందు ధర్మదర్శనమై నివేదన ప్రసాదములు—సెనగపప్పు బెల్లపునేతిదోసెలు, పొంగలి, చక్కెరపొంగలి, పండ్లు మొదలగునవి శ్రీభాష్యకారులవారి ముఖమంటపములో స్థాన బహుమాన పూర్వకముగా గోష్ఠి వినియోగమగును. ఈ తోమాలసేవ అర్చన బహిరంగముకాదు.

ఇవి రహస్యముగాన నెవరిని వదలరు. ధనుర్మాసముఘంట దర్శనమైన తరువాత తలుపులు వేయబడి ఉదయము 9 ఘంటలకు తిరిగి తెఱచి ధర్మదర్శనము లేకయే ఆర్జితతోమాలసేవ మొదలగు పూజలు మామూలు ప్రకారము జరుగును.

ఈ మాసమున రాత్రి యేకాంతసేవలో శయనమునకు శ్రీకృష్ణ స్వామివారు దయచేయుదురు.

ఈ ధనుర్మాసమున శుద్ధయేకాదశికి "ముక్కోటియేకాదశి" అనిపేరు. ఈ దినమున శ్రీవారి విమాన ప్రదక్షిణము:లోపల గర్భగృహము చుట్టునుండు వైకుంఠప్రాకారము తెఱువబడును. ఈ దినమున తప్ప యితరదినములలో నిది మూసియుండును. సాయంకాలము సర్వభూపాలవాహనములో శ్రీవారలకు వజ్రాంగి మొదలగు విశేషాభరణములు సమర్పణచేసి యుత్సవము జరుపుదురు.

ఈ రాత్రి తీర్మానము అయిన తరువాత కొంతకాలమునకే తలుపులు తెఱచి ధనుర్మాసపూజ నివేదనయు నిత్యకట్ల తోమాలసేవ

అర్చన ఘంటకాగానే చక్రత్తాళ్వారు మహాప్రదక్షిణముగా శ్రీస్వామి పుష్కరిణికి విజయముచేసి ఉదయమగు సమయమున స్నానమొనరింతురు. ఈ సమయము మహాపుణ్యకాలమనియు యిప్పుడు సమస్త పుణ్యతీర్థములును పుష్కరిణిలో కలియుననియు సమస్త దేవతలు స్నానమొనరింతురనియు నైతిహ్యము. ఈ విశేషసమయమున వేలకొలది జనులు స్వామిపుష్కరిణిలో స్నానము చేయుదురు.

9. అధ్యయనోత్సవము:— ఇది తై నెలలో 25 దినములు జరుగును. శ్రీఉత్సవరులు బ్రహ్మోత్సవములోవలెనే యీ యుత్సవమున కల్యాణమంటపమందు వేంచేసియుందురు.

ఈ కాలమున వేదాధ్యయనమును ద్రావిడ ప్రబంధ పఠనమును జరుగును.

ప్రతి దినమును తీర్మానమునకుముందు కల్యాణమంటపమున ఆస్థానము జరుగును.

10. రథసప్తమి:— ఇది ప్రతి సంవత్సరము మాఘ శుద్ధ సప్తమినాడు జరుగును. ఉదయాత్పూర్వమే శ్రీవారికి మొదటి ఘంట పూర్తియగును. వెంటనే శ్రీవారు వజ్రాంగి మొదలగు విశేష తిరువాభరణాలంకృతులై సూర్యప్రభవాహనారూఢులై సూర్యోదయమునకు సరిగా ఉత్తరపువీధికి విజయము చేయుదురు. సూర్యకిరణములు సోకుచుండగా తిరువాభరణములతో సూర్యప్రభవాహన మధ్యమున శోభిల్లు శ్రీవారికిని ఆదిత్యమండల మధ్యవర్తియగు శ్రీమన్నారాయణునికిని యీ సమయమున నైక్యత కల్గినట్లు తోచును.

తదనంతరము చిన్న శేషవాహనము, గరుడవాహనము, హనుమంతవాహనములు జరిగి చక్రత్తాళ్వార్లు పుష్కరిణిలో స్నానమొన

ర్తురు. రెండవ ఘంటయయిన పిదప శ్రీవారి మూలవరుల ధర్మదర్శన మగుచుండగా ఉత్సవరులకు సర్వభూపాలవాహనము కల్పవృక్షవాహనము, చంద్రప్రభవాహనమును జరిగి శ్రీవారు సన్నిధికి వేంచేసినపిదప రాత్రి ఘంటయై గురువారము తప్ప, గుంపు లేకయే తీర్మానమయి తలుపులు వేయబడును.

రథసప్తమి అర్ధబ్రహ్మోత్సవమునకు సమానమందురు.

---

# అధ్యాయము 7

తీర్థములు:— తిరుమలయందు అసంఖ్యాకములగు తీర్థరాజములు గలవు. వీనిలో ముఖ్యమయినవి 108 పుణ్య తీర్థములు. వీనిలో క్రింద వివరింపబడినవి పుణ్యతమములు.

**1. కటాహతీర్థము, తొట్టితీర్థము:—** ఇది శ్రీవెంకటేశ్వరస్వామి వారి దేవాలయమున విమానప్రదక్షిణములో నుత్తరభాగమున నున్నది. ఈ తీర్థము శ్రీవారి పాదముల నుండియే స్రవించుచున్నది. శ్రీస్వామి పుష్కరిణి స్నానము; శ్రీనివాసుని దర్శనము; కటాహతీర్థ పానము యీ మూడును త్రైలోక్యదుర్లభములు.

ఈ తీర్థమును సేవించునపుడు అష్టాక్షరియో లేక కేశవాది నామములో లేక శ్రీవేంకటేశాష్టాక్షరియో యుచ్చరించుచు సేవింపవలయును.

తీర్థప్రభావము:— తొల్లి తుంగభద్రాతీరమున కేశవుడను బ్రాహ్మణ యువకుడుండెను. అతడు వేశ్యాలంపటుడై ద్రవ్యాశ

చేత నొక బ్రాహ్మణుని జంపెను. తత్‌క్షణమే బ్రహ్మహత్యాపాపము ఘోరరూపము దాల్చి వానిని తరుముగా నాతఁడు పుడమియంతయు ద్రిమ్మరి తనతండ్రి పాదములపై బడి రోదనము గావించెను. ఆ సమయమున భరద్వాజమహాముని యచ్చటకేతెంచి వారికి కటాహతీర్థప్రభావము వివరించిరి. వీరియాజ్ఞచే తన తండ్రితో కేశవశర్మ శ్రీవేంకటాద్రికి వచ్చి శ్రీస్వామి పుష్కరిణిలో స్నానము గావించి శ్రీవరాహస్వామిని దర్శించుకొని కటాహతీర్థపాన మొనరించి బ్రహ్మహత్యాది దోషవిముక్తిగాంచి స్వస్థచిత్తుఁడాయెను.

ఈ తీర్థమును గుఱించి స్కన్దపురాణమున ఈ క్రింది విధమున వ్రాయబడియున్నది.

శ్లో॥ కటాహతీర్థమాహాత్మ్యం కో వేత్తి భువనత్రయే
మహాదేవో విజానాతి తస్య తీర్థస్య వై భవమ్ ॥
శ్రుతిస్మృతి పురాణేషు తస్య తీర్థప్రశంసనమ్
బహుధా వర్ణ్యతే పంచమహాపాతకనాశనమ్ ॥
అత్యద్భుతపరం విప్రాస్సర్వలోకైక పావనమ్
బ్రహ్మహత్యాఽయుతం చాఽపి సురాపానాయుతం తథా ॥
అయుతం గురుదారాణాం గమనం పాపకారణమ్
స్తేయాయుతం సువర్ణానాం తత్సంసర్గాశ్చ కోటిశః ॥
శీఘ్రం విలయమాయాంతి తస్య తీర్థస్య సేవయా
యాని నిష్కృతిహీనాని పాపాని వివిధాని చ ॥
తాని సర్వాణి నశ్యంతి తీర్థస్యాస్య నిషేవణాత్
ఇదం తీర్థం మహాపుణ్యం భగవత్పాద నిస్సృతమ్ ।

శ్లో॥ కుష్ఠాదిరోగయుక్తో యః ప్రత్యహం చ పిబేదిదమ్
సోఽపి రోగవిహీనస్సన్విష్ణులోకం చ గచ్ఛతి ॥

— స్కాందంపురాణము.

**2. పాండవతీర్థము :—** ఇది శ్రీ వేంకటేశ్వరస్వామివారి యాలయమునకు ఈశాన్యమున నొక మైలుదూరమున నున్నది. పూర్వము విజయకాంక్షులైన పాండవులు శ్రీకృష్ణుని యాజ్ఞానుసారము ఈ తీర్థమున కరుదెంచి యొక సంవత్సరము వ్రతనిష్ఠులై యుండగా నొక రాత్రి విజయము గలుగునని స్వప్నముగాంచి సంతృప్తులై తిరిగిపోయి కౌరవులతో యుద్ధ మొనరించి విజయముగాంచిరి. ఈ తీర్థములో స్నాన మొనరించువారికి పుణ్యము వృద్ధియై అశుభములు నశించును.

శ్లో॥ వృషభస్థే రవౌ రాధే ద్వాదశ్యాం రవివాసరే
శుక్లే వాఽప్యథ వా కృష్ణే పక్షే భౌమసమన్వితే।
తీర్థే పాండవనామ్న్యత్ర సజ్జమే స్నాతి యో నరః
నేహ దుఃఖమవాప్నోతి పరత్ర సుఖమశ్నుతే ॥

**3. పాపనాశనము :—** ఇది సర్వలోక ప్రసిద్ధమును సర్వ తీర్థోత్తమంబును మహాపుణ్యవంతంబును నగు తీర్థరాజము. ఇది శ్రీస్వామిపుష్కరిణికి ఉత్తరమున 3 మైళ్లలో నున్నది. సర్వపాపంబుల నశింపజేయును. గాన పాపనాశనతీర్థమని ప్రసిద్ధిగాంచినది. పూర్వము బ్రహ్మరక్షస్సుచే పట్టుబడి తిరుగుచుండిన సుమతి యను బ్రాహ్మణ బాలుడు యిందు తీర్థమాడి బ్రహ్మరక్షస్సునుండి విడిపింపబడి దీర్ఘాయు రారోగ్యము లనుభవించెను.

దృఢమతియను నొకడు పూర్వము తన దుష్కర్మచే గృధ్ర (గద్ద) రూపముగాంచి యల్లాడుచుండి తన మంచికాలమునకు యీ

తీర్థమునకు వచ్చి నీరుత్రాగిన పుణ్యమున తన పాపములు నశించి దేవతారూపముతో పుణ్యలోకముల కేగెను.

ఆరుగురు భార్యలతోను పలువురు కుమారులతోను నొక బ్రాహ్మణుఁడు యీ తీర్థమునకు వచ్చి స్నానమొనరించి 5 జానెల్లు భూమిని విప్రులకు దానమొసగి తపస్సమాధిలో నుండ శ్రీనివాసుడు గరుడవాహనుఁడై దర్శనమొసగి బ్రాహ్మణుని దీవించి యాతని మహా దైశ్వర్యవంతునిగా నొనరించెను. భగవంతుఁడు దీవించిన శ్లోకము క్రింద వ్రాయబడియున్నది.

“ ...........................

తాత తుష్టోఽస్మి భద్ర న్తే స్తోత్రేణ మహాతా ద్విజ।
సర్వభోగసమాయుక్తః పుత్రపౌత్రాదిభిర్యుతః
ఇహలోకే సుఖం ప్రాప్య దేహా న్తే ముక్తిమాప్నుహి ॥”

అని దీవించి యంతర్ధానమయ్యెను.

ఈ పరమపావనమైన తీర్థమున ముక్కోటి యగు నాశ్వీయుజ శుద్ధ సప్తమి యుత్తరాషాఢా నక్షత్రముతో కూడిన ఆదివారమునాడు గాని, ఉత్తరాభాద్ర నక్షత్రయుక్తమైన ద్వాదశినాడుగాని స్నానము మిగుల శ్రేష్ఠము.

నేటికిని తిరుమలకు పోవు యాత్రికులీతీర్థమునకుఁ బోవక తిరిగి రారు.

**4. ఆకాశగంగ :—** పాపనాశన తీర్థమున స్నాన మొనరించి తిరిగి వచ్చునపుడు యాత్రికు లీ యాకాశగంగ తీర్థమునకు వచ్చి స్నాన మొనరింతురు. ఇది స్వామిపుష్కరిణికి ఉత్తరమున 2 మైళ్లలో నున్నది. పర్వతములోనుండి అతి నిర్మలోదకము ధారగా పడుచుండును. శ్రీ

వేంకటేశ్వరస్వామి తిరువారాధన నిమిత్తమై ప్రతిదినము మూడు బిందెల తీర్థము ఆకాశగంగనుండి తెచ్చెదరు. ఈ పవిత్రస్థలమున పూర్వ మంజనాదేవి యాశ్రమము గావించుకొని 12 సంవత్సరములు నిరాహారిణియై ఘోరతప మొనరించి ఆంజనేయుని గాంచెను.

ఇచ్చట శ్రీ వేంకటేశ్వరస్వామివారు రామానుజు డను విప్రుని తపస్సునకు మెచ్చి సాక్షాత్కరించి యతని స్తోత్రములకు మెచ్చి యిట్లానతిచ్చిరి

శ్లో॥ మేషసంక్రమణే భానోశ్చిత్తానక్షత్రసంయుతే
పౌర్ణమాస్యాం చ గంగాయాం స్నానం కుర్వన్తి యే జనాః ॥
తే యాన్తి పరమంధామ పునరావృత్తివర్జితమ్ ।
వియద్గంగాసమీపే త్వంవస రామానుజద్విజ ॥

................................ ।
బహునా కిమిహోక్తేన వియద్గంగాజలే శుభే ।
స్నాన్తి యే వై జనాస్సర్వే తే వై భాగవతోత్తమాః ।
భవన్తి మునిశార్దూల నాత్ర కార్యా విచారణా ॥

— స్కాందపురాణము.

గనుక మేషమాసములో (చిత్రినెలలో) చిత్తా నక్షత్రముతో కూడిన పూర్ణిమనాడీతీర్థములో స్నానమొనరించువారు పునరావృత్తిలేని సుఖంబు గాంతురు.

ఇట్టి మహిమోపేతంబైన యాకాశగంగ నేటికిని ప్రతినిత్యము యాత్రికజనబాహుళ్యముచే క్రిక్కిరియుచు కనువిందు గొల్పుచున్నది.

5. జాబాలితీర్థము :— ఇది శ్రీస్వామి పుష్కరిణికి ఉత్తరమున రెండుమైళ్ళలో నున్నది. శిష్యసహితుడై జాబాలి మహర్షి యీ తీర్థమునందు వసించియుండిన కారణముచేత దీనికీపేరు గలిగెను.

ఈ తీర్థమున అనేక యుగములు అగస్త్య మహామునులు శిష్యులతోనుండి శ్రీ వేంకటేశ్వరులవారిని బహువిధముల పూజించుచుండిరి.

బ్రహ్మహత్యాది పంచమహాపాతకములు సహితం మీా తీర్థావగాహనంబుచే నశించుటయేగాక ఘోరపిశాచగ్రస్తులును విముక్తులగుదురు.

పూర్వము కావేరీతీరమున పంచమహాపాతకము లొనరించుచుండిన దురాచారుఁడయిన బ్రాహ్మణుడు పిశాచముచే పట్టువడి భూమియంతయు తిరుగుచుండ నొకనాడు తిరుమలకు వచ్చి యీా తీర్థమున స్నానముచేసి సకల పాపవిముక్తుడయి పిశాచమునుండి విడుదలనొంది సుఖించెను. ఇతని స్నానఫలంబున నితనిని పట్టియుండిన పిశాచమునకును ముక్తి గలిగెను.

6. శ్రీవైకుంఠ తీర్థము :—శ్రీస్వామి పుష్కరిణికి యీాశాన్యమున రెండు మైళ్లదూరమున నొక గుహాయున్నది. ఈ గుహకు వైకుంఠ గుహా యనియు దీనిలోనుండి సదా బయటికివచ్చు తీర్థమునకు వైకుంఠ తీర్థమనియు నామములు.

పూర్వము శ్రీరాములవారు వానర సైన్యముతో పంపానది దాటి లంకకు బోవుచు మార్గమున శ్రీస్వామిపుష్కరిణీ తీరమున నిల్చిరి. ఆ సమయమున వానరశ్రేష్ఠు లీ పర్వతరాజమున నుండు సృష్టివైచిత్ర్యముల చూచుచు, ఈ గుహాను ప్రవేశించి అందొక దివ్య తేజమును, దివ్యనగరమును గాంచిరి. ఆ తేజోమధ్యమున నుండి చతుర్బాహుండైన

మహాపురుషుడు వెడలివచ్చి తన హస్తమున గన్పట్టిన దండముతో వీరిని కొట్టవచ్చినట్లు కనపడగా వీరందఱును భయభ్రాంతులై గుహను విడిచి పరుగెత్తివచ్చి తమ మిత్రులకు తెల్పిరి. వారాగుహ చేరి చూడగా వారి కేమియు కనబడలేదు. ఈ గుహలోనికి ప్రవేశించుటకు మునులకును యోగిపుంగవులకును గూడ కష్టసాధ్యము.

ఈ గుహయందు పరివారసహితుడై శ్రీమన్నారాయణుడు విహరించుచుండెననియు వానరశ్రేష్ఠులకు తన దివ్యనగరముతో దర్శన మిచ్చెననియు, పురాణము వచించుచున్నది.

ఈ వైకుంఠగుహాదర్శనంబును తీర్థావగాహనంబును ననంత ఫలదాయకములు.

7. చక్రతీర్థము :— ఈ తీర్థము తిరుమలకు రెండుమైళ్ళదూరమున వాయవ్యమూల యందున్నది.

దీనియందు స్నానము చేయువారికి ఉత్తమఫలంబులు సిద్ధించును.

పద్మనాభుడను మహాముని పూర్వ మిచ్చట శ్రీ వేంకటేశ్వరుల గూర్చి ఘోర తపమొనరించెను.

తపమునకు మెచ్చి శ్రీవేంకటేశ్వరస్వామివారు శంఖచక్ర గదాధరుడై ప్రత్యక్షమై మహామునిని అనుగ్రహించి కల్పాంతమువఱకును నిచ్చటనే తపము సల్పుచుండుమని మహామునికి అనుజ్ఞయొసగి అచ్చట తపము చేయువారలకు రాక్షసబాధలు లేకుండునట్లు చూచుకొనుటకై తన చక్రాయుధమునకు ఆజ్ఞ యిచ్చెను. తదాదిగా శ్రీచక్రత్తాళ్వార్లు యీ తీర్థమున అదృశ్యులై తాపసుల గాపాడుచుందురు.

ఈ తీర్థమునుండు శ్రీలక్ష్మీనరసింహస్వామివారికిని సుదర్శన చక్రము (చక్రత్తాళ్వారు) లకును ప్రతిసంవత్సరము కార్తిక బహుళ

ద్వాదశినాడు మధ్యాహ్నము శ్రీవారి దేవస్థాన కైంకర్యపరులచే నభి షేకమును శ్రీవారి దేవస్థానమునుండి తేబడిన పాయసము తళిగ యారగింపును జరిగి వినియోగమగును. జనులు విశేషముగావచ్చి యానాడు స్నానము చేయుదురు. ఈ తీర్థము తపస్సునకు మంచిస్థలము. సదా సుదర్శనాళ్వారులచే సంరక్షితము.

8. రామకృష్ణతీర్థము :—ఇది శ్రీస్వామిపుష్కరిణి కుత్తరమున 6 మైళ్ళ దూరముననున్నది. పూర్వము కృష్ణుడను ముని యిచ్చట తపస్సుచేయుచుండి తనస్నానార్థ మీతీర్థమును కల్పించుకొనెను.

పిమ్మట రామకృష్ణుడను మహాముని యిచ్చట బహుకాలము ఘోరతపము చేయుచుండెను ఈతని తపమునకు మెచ్చి శ్రీవేంకటేశ్వరులు గరుడారూఢులై మకర (తై) మాస పుష్యమీ నక్షత్రయుత పౌర్ణమినాడు రామకృష్ణమునికి ప్రత్యక్షమై ఈ దినమున నీ తీర్థములో స్నానమొనర్చు దేవతలు మనుష్యులు మొదలగువారికి సర్వపాపములు హరించి సకల సుఖాభివృద్ధియగుననియు, నీ తీర్థము రామకృష్ణతీర్థమని ప్రసిద్ధిగాంచుననియు నానతియొసగి యంతర్ధానమైరి.

ప్రతిసంవత్సర మీశుభదినమున వందలకొలది జను లీ తీర్థమునకు స్నానమునకై పోవుదురు. దేవస్థానమునుండి ప్రసాదములు మొదలగునవి పంపబడును. దేవస్థానపు శిబ్బందీలు అర్చకులు మొదలగువారందరు పోవుదురు. అచ్చటనుండు కృష్ణవిగ్రహమున కభిషేకమై దేవస్థానమునుండి తేబడిన ప్రసాదము లారగింపయి వినియోగము చేయబడును.

9. కుమారధార :— పాపనాశన తీర్థమునకు వాయవ్యమున మూడు మైళ్ళ దూరమున కుమారధార తీర్థము కలదు.

శ్లో॥ కుంభమాసే పౌర్ణమాస్యాం ప్రాదుర్భావ దినేహరేః ।
కుమారధారికాస్నానం కులకోటిం సముద్ధరేత్ ॥
ఇతిమన్త్రం సమూచ్చార్య స్నాత్వాఽనన్త ఫలం లభేత్ ।
వర్షేవర్షే కుంభమాసే పౌర్ణమాస్యాం మఘాయుజి ॥
దేవా మనుష్యాస్సర్వే చ స్నాతుమాయాన్తు సర్వదా ,
పుణ్యదేశేషు సర్వేషు వేఙ్కటాద్రి ర్విశిష్యతే ॥
తత్రసర్వేషు తీర్థేషు స్వామిపుష్కరిణీ వరా
తతోప్యేతద్వరం తీర్థం మఘావిర్భావవాసరే ॥

—మార్కండేయ పురాణము.

కుంభరాశియందు రవియుండగా మఘా నక్షత్రముతో కూడిన మాఘశుద్ధ పౌర్ణమినాటి మధ్యాహ్నము యీ తీర్థములో స్నానము చేసినయెడల గంగానది సర్వ తీర్థములందు స్నానము గావించిన ఫలము ప్రాప్తించును.

ఈ దినమున ప్రతి సంవత్సరము శ్రీవారి ప్రసాదమైన తళిగెలు చందనము, తాంబూలము తీసికొనిపోబడి యిచ్చుట వినియోగమగును.

ఈ తీర్థమున అన్నదానము చేసి చందనతాంబూలము లొసగు వారికి స్నానఫలము లభించును.

ఈ తీర్థమున స్నానము చేయువారికి బ్రహ్మహత్యాది మహా దోషములు హరించుటయేగాక అరోగ దృఢకాయమును, అష్టైశ్వర్య సంపత్తును లభించును.

పూర్వము తారకాసురుని వధించిన పాపముచే బ్రహ్మహత్య కుమారస్వామిని చుట్టుకొని పీడించగా స్కందుడు యీ తీర్థమునకు వచ్చి తపముచేయ

"కుంభమాసే పౌర్ణమాస్యాం మఘాయాం సౌమ్యవాసరే।
మధ్యాహ్నే ప్రాదురభవద్యథా మనసి చిన్తితః"॥

అను ప్రకారము శ్రీ వేంకటేశ్వరస్వామి కుమారస్వామికి ప్రత్యక్షమాయెను. స్కందుఁడు దోషవిముక్తుఁడై సుఖించెను. ఆసమయమున శ్రీ వేంకటేశ్వరస్వామి కుమారస్వామిని పరమకృపతో కటాక్షించి యిట్లానతిచ్చిరి.

శ్లో॥ మదీయం మంత్రముచ్చార్య సుఖీ భవ మహామతే।
ఏతత్పర్వతమారోఢుం వాఞ్ఛా యస్యాస్తి దేహినః॥
పాతకం దూరతో నశ్యేత్కిము భక్తిమతస్తవ।
తత్రాఽపి స్వామిసరసి స్నానం కోట్యఘనాశనమ్॥
శృణ్వన్తు దేవతాస్సర్వా శ్శృణు స్కన్ద వచో మమ।
కుమారధారికేత్యేవ త్వన్నామ్నేదం భవిష్యతి॥
తత్ర స్నాతి పుమాం స్త్రీ వాఽవశ్యం కోపితు మానవః।
తస్య పాపాని నశ్యన్తి సత్యం సత్యం వదామ్యహమ్॥

—మార్కండేయ పురాణము.

భగవంతుడే యిట్లనుగ్రహించిన కారణమున నీ తీర్థము తదాదిగా కుమారస్వామినామముతో కుమారధార యని పిలువబడు చున్నది.

ఈ పేరు వచ్చుటకు మఱియొక కారణము గలదు. మహా వృద్ధుడగు బ్రాహ్మణుడొకఁడు పూర్వము అత్యంత దారిద్ర్యముచే పీడితుడై భార్యా పుత్రుల సంరక్షింప జాలక దుఃఖాతిశయముచే వారిని వదలి వేంకటాద్రి శృంగమునెక్కి ప్రాణపరిత్యాగోద్యుక్తుడై ఉచ్చైస్స్వర

ముతో "అహో, దారిద్ర్యము సహింపజాలను. ఈ శిఖరమునుండి క్రిందపడి ప్రాణమువదలెదను, పడుచున్నాను. పడుచున్నాను. పడుచున్నాను." అనుచుండగా శ్రీ వేంకటేశ్వరులు మృగయా వినోదమున నుండు క్షత్రియరూపముదాల్చి బ్రాహ్మణునికి ప్రత్యక్షమై యాతని నివారించి యాతని హస్తమును ప్రీతితో పట్టుకొని ముదుసలియైన నాతనితో సాంత్వనముగ సంభాషించుచు మెల్ల మెల్లగ చేరువనుండిన యీ తీర్థమున స్నానము చేయుమని యానతిచ్చెను.

వృద్ధ బ్రాహ్మణుడు స్నానముచేసి వెంటనే కుమారుడై లేచి నలుదిక్కులు పరికించెను. శ్రీ వేంకటేశ్వరు డంతర్ధానమాయెను. బ్రాహ్మణుడు స్వామిని వెదకుచుండ నాకాశవాణి "ఓ బ్రాహ్మణుఁడా! నేను వేంకటేశ్వరుడను. ఈ తీర్థమున స్నానముచేసిన పుణ్యముచే నీవు కుమారుడవైతివి. మహా దైశ్వర్యవంతుడవు కాగలవు. ధైర్యముతో నీ గ్రామమునకు పోయి ధర్మము చేయుచు, నీ కుటుంబమును రక్షించుకొనుము" అని యానతిచ్చెను. బ్రాహ్మణుడు సంతోషముతో నిల్లుచేరి యనంతైశ్వర్యములతో సుఖించెను.

కాన వృద్ధబ్రాహ్మణుఁడు స్నానఫలమున కుమారత్వము గాంచిన కతమునను నీ తీర్థము కుమారధార యనబడును.

10. ఘోణతీర్థము (తుంబురుతీర్థము):— ఈ తీర్థము శ్రీస్వామి పుష్కరిణి కుత్తర భాగమున 10 మైళ్ళ దూరమున నున్నది. ఇది బహు రమణీయమైన యరణ్య ప్రదేశమున నున్నది.

మీన ( పంగుని ) మాసములో ఉత్తర ఫల్గుని నక్షత్రయుక్త పౌర్ణమినాడు ఈ తీర్థమున ముక్కోటి దినము. ఆదిన మనేకులచ్చటికేగి స్నాన జప భోజనాదులుగావించి సాయంకాలమునకు తిరిగివచ్చెదరు.

తొల్లి తుంబురుడను ఋషి యిచ్చట తపము గావించుచుండెను. అతని తపస్సునకు సంతుష్టుండై శ్రీవేంకటేశ్వరస్వామివారు.

" .................................... |

తతః ఫాల్గుణమాసే తు పౌర్ణమాస్యాం మహాతిథౌ ॥

ప్రాదుర్బభూవ భగవాన్ తత్ర వేంకటనాయకః ।

పీతామ్బరో దివ్యగంధస్రగ్భూషాభిరలంకృతః ॥ "

అను శ్లోకముల వివరించిన రీతి తుంబురునికి ప్రత్యక్షమైరి. సాష్టాంగదండ ప్రణామంబులాచరించి తుంబురుఁడు భక్తిరసోద్రేకంబున స్వామిని స్తుతియించి

" భగవన్మమ నామ్నైవ తీర్థమేతత్ప్రసిధ్యతు । "

అని ప్రార్థింపగా 'తథాఽస్తు' అని భగవంతుఁడానతిచ్చెను. గాన యీ తీర్థమునకు తుంబురు తీర్థమని నామధేయము కలిగెను. ఉత్తర ఫల్గుని నక్షత్రమందు శ్రీవారు యిచ్చట ఆవిర్భవించిరి. గాన దీనికి " ఫల్గునీ " తీర్థమనియు పేరు గలదు.

ఈ తీర్థమున నరుంధతియు వసిష్ఠుడును వేర్వేర తపంబుండి శ్రీ వేంకటేశ్వరుని ప్రత్యక్షంబు గావించుకొనిరి.

సర్వాబద్ధుడును, నాస్తిక దురాచారుడునగు బ్రాహ్మణుడొకడు వసిష్ఠ బోధితుఁడై యీ తీర్థమున స్నానమాడి భగవంతుని వరంబున సర్వాబద్ధుడను పేరు వీడి సర్వసిద్ధుడను పేరుగాంచి బహుళైశ్వర్య వంతుఁడై దానధర్మము లొనరించి ప్రఖ్యాతి గాంచెను.

శ్రీ సూతబ్రహ్మర్షి శౌనకాదిమహామునులకీ తీర్థప్రభావమును వర్ణించుచు,

శ్లో॥ అత్రాహం సంప్రవక్ష్యామి శౌనకాద్యా మహారాజనః ।
ఘోణతీర్థస్య మాహాత్మ్యం సర్వపాతకనాశనమ్ ॥
తత్ర స్నానం జనానాం తు జన్మాంతరతపఃఫలమ్ ।
ఉత్తరాఫల్గునీయుక్తశుక్లపక్షీయపర్వణి ॥
తుమ్బోస్తీర్థం మీనసంస్థే రవౌ తీర్థాని సర్వశః ।
అపరాహ్ణే సమాయాన్తి గంగాదీని జగత్త్రయే ॥

— స్కాందపురాణము.

అని వచింప శౌనకాదులు సూతుని జూచి పుణ్యకాలమున జనులు వచ్చి తీర్థమాడుట సహజముగాని త్రిజగములగల గంగాది పుణ్యనదు లీ తీర్థమున కేలవచ్చి స్నానము చేయవలయుననిన, తమలో స్నానమాడు జనుల పాపములను భరింపలేక గంగాదినదు లీ తీర్థమునజేరి తమ పాప భారమునుండి విముక్తిగాంచునని ప్రత్యుత్తర మొసగిరి.

ఇంతకంటె నీ తీర్థప్రభావము విస్తరింపనేల ! ఇచ్చట నాంధ్ర కవియిత్రియు భక్తురాలునైన తరిగొండ వెంకమ్మ తప మొనరించిన స్థలము కనబడుచున్నది.

---

## అధ్యాయము 8.

తిరుగు ప్రయాణము :— శ్రీవారి దర్శనార్థము తిరుమలకు వచ్చు యాత్రికులు శ్రీ స్వామి పుష్కరిణిలో స్నానమాడి పరిశుద్ధులై శ్రీవారి దేవాలయమునకు పోయి కానుకలు సమర్పించి శ్రీవారి దర్శనము చేసికొనిన పిదప అవకాశానుసారము శ్రీవారి దేవాలయమునకు సమీపమున నుండు పాండవ తీర్థము, ఆకాశగంగ, పాపనాశన తీర్థములలో

స్నాన మొనరించికొని కొండ దిగునప్పుడు శ్రీవారి దేవాలయములోనికి పోయి ప్రదక్షిణముచేసి భగవంతుని యనుమతిగొని శ్రీవారి ప్రసాదములను తీసికొని పోవుదురు.

## ప్రసాదములు

1. శ్రీపాదచందనము :— శ్రీవారికి ప్రతి నిత్యము రాత్రి యేకాంతసేవయందు పాద సమర్పణమైన చందనమును శ్రీపాద చందన మందురు. ఇది మరుదిన ముదయమున విశ్వరూప దర్శనకాలములో కొంత వాడబడి మిగతలో స్వల్పభాగము అర్చకులకు జేరును. తక్కినది దేవస్థాన పారుపత్యదారువద్ద నుండును. వారు సముచితరీతిగా నుచితముగా దానిని యాత్రికుల కొసగుదురు. అర్చకులవద్ద వెలకు దొరకును.

శ్రీపాదరేణువు :— శ్రీవారికి సమర్పింపబడిన పచ్చ కర్పూరము, పునుగుతైలము మిశ్రమమునకు శ్రీపాదరేణువు అని పేరు. దేవస్థానమువారు సాధ్యమైనంత వరకు భక్తులకు ఉచితముగా దీని నొసగుదురు. అర్చకులు మొదలగు కొందరు కైంకర్యపరులవద్ద వెలకు కూడ దొరకును.

3. అభయ హస్తములు :— శ్రీవారి హస్తమునకు నొత్తబడి రేఖలు గల్గిన చందనపు బిళ్ళలకు అభయహస్తములని పేరు.

4. మాణిక్యములు :— శ్రీవారి హస్త కవచమునన్నున్న రత్నములకు నొత్తబడిన చందనపు బిళ్ళలకు మాణిక్యములని పేరు.

5. పులికాపుతీర్థము :— శుక్రవారమున శ్రీవారికి జరిగిన అభిషేక తీర్థమునకు పుళికాపు తీర్థమని పేరు. ఈ తీర్థము కొంచెము కొంచెముగా పారుపత్యదారుని యుత్తరువున యాత్రికులకు నొసగబడును. యాత్రికు లీ ప్రసాదముల స్వీకరించి కొండదిగి తిరుపతికి

రెండున్నరమైలు దూరములో నుండు అలర్మేల్ మంగాపురము — పద్మ సరోవరము అను నామాంతరములు గల శుకపురి - తిరుచానూరు - తిరుచ్చుకనూరుకు పోయి యచ్చట వేంచేసియుండు శ్రీ పద్మావతి యమ్మవారు అను అలర్మేల్ మంగతాయార్లను తప్పక సేవించుకొని పోదురు.

తిరుచానూరు :— ఇచట పూర్వము శుకమహర్షి యాశ్రమము కల్పించుకొని తప మొనరించుచుండెను. శుకుఁడుండిన యూరు గనుక అరవమున దీనికి తిరుశుకనూర్ ; శ్రీ శుకగ్రామము (శుకుని యూరు) అని పేరు గలిగెను. తిరు = శ్రీ, లేక శ్రేష్ఠవాచకము. తొలుత తిరుశుకనూరని పిలువబడుచు కాలక్రమమున తిరుచానూరను వ్యవహార నామమాయెను.

ఈ యూర పద్మసరోవరమను ఒక కొలనున్నది. దీని నానుకొని తూర్పున శ్రీ యలర్మేల్ మంగతాయార్ అనే పద్మావతి యమ్మవారి దేవస్థానమున్నది.

ఇందు శ్రీ శుకులచే ప్రతిష్ఠింపబడిన శ్రీ బలరామ కృష్ణుల యాలయమును, శుకబ్రహ్మర్షి పుత్రుడైన ఛాయాశుకునిచే పూజింపబడిన శ్రీ వీరలక్ష్మియైన పద్మావతి యమ్మవార్ల యాలయమును, శ్రీ సుందరరాజస్వామి ఆలయములును గలవు.

తిరుమలయందు శ్రీ వెంకటేశ్వరుల దర్శన మెంత ముఖ్యమో యిచ్చట శ్రీ పద్మావతి యమ్మవార్ల దర్శనమంత ముఖ్యము. శ్రీవారి ప్రభావమునకు పద్మావతి అమ్మవారే మూలకారణము గాన యాత్రికు లీ యమ్మవారిని తప్పక సేవించి తీరవలయును.

పద్మసరోవర మాహాత్మ్యము:— పూర్వము త్రిమూర్తులలో మిక్కిలి శాంతమూర్తి యెవరని పరీక్షచేయుటకు భృగుమహాముని వైకుంఠమునకు పోయి శ్రీమన్నారాయణుని రొమ్మున తన్నెను.



శ్రీ పద్మావతీ అమ్మవారు

తన నివాసస్థానము అపవిత్రము గావించెనని తలచి లక్ష్మీదేవి శ్రీమన్నారాయణుని వదలి భూలోకమున కొల్లాపురమునందు కొంత కాలము తపస్సుచేసి పిదప పాతాళమున కపిలమహాముని ఆశ్రమమునకు బోయి తపమొనర్చుచుండెను.

లక్ష్మీదేవి శ్రీవైకుంఠమును వదలిపోయిన పిదప నారాయణుడు భూలోకమున శేషాద్రియం దావిర్భవించి లక్ష్మీదేవిని గాంచుటకై పుణ్యవంతమగు తిరుశుకనూరను నీ శుకాశ్రమమునకు వచ్చి యీ సరోవర మధ్యమున ఆకాశగంగలోని స్వర్ణపద్మమును నాటి తాను నీట నిల్చి సూర్యదేవుని వీక్షించుచు పండ్రెండు సంవత్సరములు చలింపక లక్ష్మీమంత్రమును జపించుచుండెను.

శ్రీ కపిలాశ్రమమున తపస్సు చేయుచుండిన శ్రీ మహాలక్ష్మి "అయ్యో! యింతకాలము నిర్దయతో వేఱుపడి యుంటినిగదా! ఈ శరీరము పాపముతో కూడినదాయెను. దీనితో నిచ్చటనే తపము చేయు చుండెదను. నా కళలోని అర్ధాంశముతో "వ్యూహాలక్ష్మి" యను క్రొత్త శరీరము దాల్చి నా నాథుని వక్షస్థలము జేరెదను." అని నిశ్చయించి కార్తీకశుద్ధ పంచమి ఉత్తరాషాఢ నక్షత్రముతో చేరిన భానువారమునాడు పద్మసరోవరమున శ్రీనివాసుని యెదుట నుండు బంగారు పద్మమున నుదయించి శ్రీనివాసుని యురమునందు జేరెను. ఆ సమయమున గుమిగూడియున్న బ్రహ్మాదులు పుష్పవర్షము గురిపించిరి.

పాతాళమున మిగిలిన యర్ధాంశమైన "శ్రీవీరలక్ష్మి" యట్లే కొన్ని సంవత్సరములు శ్రీనివాసుని మదినెంచి భర్తను వీడియుండిన పాపమునుండి విముక్తిగాంచుటకై ధ్యాననిమగ్నయై తపము జేయుచుండి మునుపు "వ్యూహాలక్ష్మి" రూపమున శ్రీనివాసునికి ప్రత్యక్షమైన యా కార్తికశుద్ధ పంచమి యుత్తరాషాఢాయుత భానువారమునాడు

మధ్యాహ్నమున యీ పద్మసరోవరమున నుదయించెను. ఈపుణ్యకాలమున బ్రహ్మాది దేవతలును సిద్ధ యక్ష కిన్నర గరుడ గంధర్వాదులును అచ్చటికి వచ్చి పుష్పవర్షము వర్షించి ప్రాంజలులై ఆదిలక్ష్మియగు ఆ వీరలక్ష్మిని స్తుతియించి ప్రతి సంవత్సర మీ సమయమున నీ తీర్థమున స్నానమొనరించువారికి సకల సౌభాగ్యసంపదలు ప్రాప్తించునని శాసించి స్నానము గావించిరి.

ఆ సమయమున శ్రీనివాసుఁడు వచ్చి అమ్మవారిని తిరుమలకు రావలయునని ప్రార్థించెను. అమ్మవారు "వ్యూహాలక్ష్మిరూపమున మీ వక్షఃస్థలమున నేను సదా నివసించియున్నాను గదా" అని యోదార్చి "ప్రతి సంవత్సరమును నే నీ సరోవరమున నుదయించిన దినమగు కార్తికశుద్ధ పంచమినాడు మీరు ధరించిన పుష్పమాలికయు నొక వస్త్రమును పంపుడు. అదియే నాకు మహాప్రసాదము" అని శ్రీవారిని మన్నించి వీడుకొల్పెను.

తత్క్షణమే అమ్మవారు విశ్వకర్మచే నిర్మింపబడిన దేవాలయమును మహావైభవముతో ప్రవేశించిరి.

ఛాయా శుకమహర్షి అమ్మవారిని పాంచరాత్రాగమ విధానమున పూజింపదొడగెను.

అమ్మవారిప్పటికిని పాంచరాత్రాగమవిధానమున పూజగాంచుచు భక్తులకు కల్పవృక్షమువలె విరాజిల్లుచున్నారు.

అలర్ = పుష్పము (తామర) మేల్ = పైన (జనించిన) మంగై = దేవి, పద్మోద్భవ అని యర్థము. అలర్‌మేల్మంగై యను నదియే అలమేలు మంగమ్మ యాయెను.

అమ్మవారికి ప్రతి సంవత్సరము రథోత్సవమునకు మరునాడు కార్తికశుద్ధ పంచమి వచ్చునట్లే యీ బ్రహ్మోత్సవము జరుగును.

కార్తిక శుద్ధ పంచమి దినమున అమ్మవారు చక్రత్తాళ్వారు సహితముగా పద్మసరోవర తీరమున నుండు మంటపమునకు విజయము చేయుదురు. అమ్మవారికి అభిషేకమైన యనంతరము చక్రస్నానమగును. ఆ సమయమున లక్షలకొలది జనులు నిరీక్షించుచుండి స్నానమొనర్తురు.

తిరుమలకు వచ్చు యాత్రికులు తప్పక ఇచ్చటికి కేతెంచి పద్మసరోవరమున మున్కలిడి అమ్మవారిని దర్శించుకొని వెళ్లుదురు.

ఈ దేవాలయమున జరుగగల ఆర్జిత విశేషముల క్రింద వివరించు విధమున సొమ్ము చెల్లించవలయును.

| నెం. | సేవలు వగైరా వివరం. | శ్రీపద్మావతి అమ్మవారికి | | | శ్రీకృష్ణ స్వామివారికి | | | శ్రీసుందరరాజ స్వామివారికి | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
| 1 | తులసిఅర్చన | 0 | 12 | 0 | 0 | 4 | 0 | 0 | 4 | 0 |
| 2 | కుంకుమ అర్చన | 0 | 12 | 0 | — | — | — | — | — | — |
| 3 | సహస్రనామార్చన | 5 | 0 | 0 | — | — | — | 5 | 0 | 0 |
| 4 | తళిగవర్తన | 0 | 4 | 0 | 0 | 4 | 0 | 0 | 4 | 0 |
| 5 | పాలకీవాహనము | 5 | 0 | 0 | 5 | 0 | 0 | 5 | 0 | 0 |
| 6 | గరుడవాహనము (మజూరిసహా) | 27 | 0 | 0 | 27 | 0 | 0 | 27 | 0 | 0 |
| 7 | హనుమంత వాహనము (మజూరిసహా) | 27 | 0 | 0 | 27 | 0 | 0 | 27 | 0 | 0 |
| 8 | ఏనుగవాహనము | 21 | 0 | 0 | 21 | 0 | 0 | 21 | 0 | 0 |
| 9 | తిరిచి ఉత్సవము | 5 | 0 | 0 | 5 | 0 | 0 | 5 | 0 | 0 |
| | తిరిచి మజూరి | 8 | 8 | 0 | 3 | 8 | 0 | 3 | 8 | 0 |
| 10 | హారతి | 0 | 4 | 0 | 0 | 2 | 0 | 0 | 4 | 0 |
| 11 | పంచామృతాభిషేకము | 1 | 8 | 0 | 1 | 8 | 0 | 1 | 8 | 0 |

పద్మసరోవరమునకు తూర్పున శ్రీ సూర్యనారాయణస్వామి ఆలయమున్నది. ఇచ్చట శ్రీ వైఖానసాగమ విధానమున పూజ జరుగును.

ఇచ్చట దేవాలయమునకు దక్షిణపువైపు దేవస్థానపు సత్ర మున్నది. దేవాలయమునందును పద్మసరోవరముచుట్టును దేవస్థానము వారు ఎలక్ట్రిక్ లైట్లు వేసియున్నారు.

పద్మసరోవరమునకు దక్షిణమున నున్న స్వర్ణముఖరీ తీరమున తిరుచానూరు అగ్రహారికులకు సంబంధించిన శ్రీనివాసస్వామి దేవాలయ మును శ్రీవైష్ణవ వడగల సన్న్యాసులుండు ఆశ్రమమును కలవు.

---

# అధ్యాయము 9

## శ్రీవేంకటేశ్వర దేవస్థాన చరిత్రాధారములు

**1. పురాణాంశములు :—** ఈ దేవాలయము అనాదియని పురాణప్రసిద్ధము. వర్తమాన శ్రీశ్వేత వరాహ కల్పాదియందు శ్రీవైకుంఠనాథుడు హిరణ్యాక్షుని సంహరింప వరాహావతారమెత్తి తదాదిగా నీభూలోకమున స్వర్ణముఖరీనదీ తీరమున శేషాద్రిపై గరుడు నిచే వైకుంఠమునుండి తీసికొనిరాబడిన స్వామిపుష్కరిణీ సహితమైన యీ తిరుమలయందు సన్నిధి గావించుకొని వేంచేసి యున్నారనియు, తదనంతరము స్వామిపుష్కరిణీ తీరమున పుత్రార్థియై దశరథుడు తపము జేయుచుండ నతనికి బ్రహ్మరుద్రేంద్రాదుల సమక్షమున శ్రీమన్నారా యణుఁడు శంఖచక్రగదాధారియై ప్రత్యక్షమాయెననియు ఆసమయమున

శ్రీనివాసునికి బ్రహ్మశ్రీవైఖానసాగమప్రకారము అర్చించి కన్యా (పెరటాశి) మాసమున రథోత్సవము గావించెననియు బ్రహ్మకు పిదప శ్రీవిఖనసమహర్షియు, నాతని వెనుక వరుసగా మరీచి, అత్రి, కశ్యపుడు భృగువును పూజించిరనియు భృగువునకు పిమ్మట శ్రీవిఖనసబ్రహ్మకు శిష్యుడైన పల్లమహాముని శిష్యులై యతులు స్వాయంభువ మన్వంతరము వఱకు పూజించిరనియు, ఇటులే స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు అనునైదు మన్వంతరముల యందును వర్తమాన వైవస్వతమన్వాది 28-వ కలియుగము 5050 సంవత్సరమగు నేటికిని శ్రీవైఖానసాగమ విధమున ఆ ఋషి సంతతివారిచే శ్రీవారికి పూజ జరుగుచున్నదనియు పురాణ ప్రత్యక్ష అనుభవముల వలన తెలియుచున్నది.

2. చరిత్రాంశములు:— క్రీ. శ. 9-వ శతాబ్దమునకు పూర్వము నుండియు తిరుపతి–తిరుమల ప్రదేశములు కాంచీపురము రాజధానిగా గలిగియుండిన పల్లవ వంశరాజుల యేలుబడిలోని తొండమండలమను భాగములోనివై యుండెను. వెనుకటి హిందూరాజులును ఈ మండలమును యిదేపేరుతో వ్యవహరించుచుండిరి.

పల్లవ వంశస్థులకు పిమ్మట తొండమండలమును ఒరయూరు చోళవంశస్థులును, మల్ఖేడ్ రాష్ట్రకూటులును, తంజావూరి గొప్పరాజైన రాజరాజదేవుడును విజయనగరరాజులును పరిపాలించిరి.

క్రీ. శ. 1565 సంవత్సరమున తాలికోట యుద్ధమున విజయనగర రాజ్యము బిజాపురగోలకొండ సుల్తానుల వశమైన పిదప కొంతకాలము వఱకు నామకార్థముగా విజయనగర రాజులుగానుండిన రాజులు చంద్రగిరిలోనుండి యీ మండలమును తమ స్వాధీనమున నుంచుకొనియుండిరి.

క్రీ. శ. 1687 సంవత్సరమున యీ మండలము కర్నాటక నవాబులకు స్వాధీనమై క్రీ. శ. 1781-వ సంవత్సరమున యీ జిల్లా వరుంబడి అధికారము (East India Company) వారికి కర్ణాటక నవాబుచే నొసగబడి 1801 క్రీ. శ. మున కర్నాటకరాజ్యమంతయు సదరు కంపెనీ వశమాయెను. పైన వచించిన కారణముల ననుసరించి పూర్వపు హిందూ రాజులును, కర్ణాటక నవాబులును, (East India Company) వారును క్రీ. శ. 1843 వరకును యీ దేవస్థానమును పరిపాలించుచుండిరి.

క్రీ. శ. 1841 సంవత్సరమున (East India Company) వారు దేశీయ మత విషయములలో తాము జోక్యముంచుకొన కూడదని తీర్మానించికొని 1843 సం॥ర జూలై నెల 10_వ తేదిన యీ దేవస్థానముల పరిపాలనాధికారమును అప్పటిలో తిరుపతిలోని శ్రీహాథీరాంజీ మఠమునకు మహాంతుగానుండిన శ్రీసేవాదాసజీవారికి సన్నదు మూలముగా నొసగిరి.

**మహాంతులు:—** 10_7_1843 మొదలు 6_6_1933 వరకు శ్రీతిరుమల తిరుపతి దేవస్థానములు తిరుపతిలోనుండు శ్రీహాథీరాంజీ మఠముయొక్క మహాంతులచే పరిపాలింపబడు చుండెను.

ఈ కాలమున మహాంతుల పరిపాలనముయొక్క విధానము నందు కొన్ని మార్పులు అవసరమని 1898 సం॥లో O. S. 31 of 1898 దావా చిత్తూరు జిల్లాకోర్టులో తేబడి అది ప్రీవీకౌన్సిలువరకు పోయి 1_11_1907 మొదలు 26 సంవత్సరములు ప్రీవికౌన్సిల్ స్కీమును అనుసరించి శ్రీమహాంతువారి వల్లనే ఈ దేవస్థానములు పరిపాలింపబడు చుండినవి.

7_6_33 మొదలు మదరాసు శాసన సభవారు చేసిన (Madras Act No. X1X of 1933) చట్టమును అనుసరించి ఈ దేవస్థానములు

శ్రీతిరుమల తిరుపతి దేవస్థాన కమిటీవారిచే ఒక కమిషనరువారు ద్వారా పరిపాలింప బడుచున్నవి.

**శ్రీతిరుమల తిరుపతి దేవస్థాన కమిటీ:—7-6-33** మొదలు పై జెప్పబడిన కమిటీవారి తీర్మానములను అనుసరించి సదరు చట్టముక్రింద గవర్నమెంటువారిచే నియమింప బడు "కమిషనర్" అను ఉద్యోగి వలన యీ దేవస్థానములు పరిపాలింపబడుచున్నవి.

ఈ కమిటీ మదరాసు గవర్నమెంటువారి వలన నియమింపబడు యేడ్గురు సభ్యులుగలిగి యుండును.

ఈ సభ్యులు మూడు సంవత్సరముల కొకతూరి నియమింప బడుదురు.

ఈ చట్టమును అనుసరించి ప్రస్తుతము అములులోనున్న కమిటీకి మునుపు రెండు కమిటీలు పనిచేసినవి.

రెండవ కమిటీవారు (Oriental Institute) ను స్థాపించి దాని కార్యభారమును ప్రస్తుత కమిటీవారి కొసగి పోయిరి. తొలి రెండు కమిటీలును యాత్రికుల సౌకర్యార్థము ఒనరించిన సౌకర్యము లా యా చోట్ల నింతకు పూర్వమే వివరింపబడియున్నవి.

---

## ...పదటి అధ్యాయము.

...మ్మిది అధ్యాయముల విషయముల వలన ...దేవస్థానమనాదియై స్వయంవ్యక్తమై, ...లయందు బ్రహ్మాదులచే నారాధింప ...ఋగ మందిరమై భక్తులకు చతుర్విధ ...డుచున్నది.

ఈ దేవస్థానము హిందూరాజుల పరిపాలనములో సర్వవిధముల నభివృద్ధిగాంచి వారిచే పోషింపబడుచుండెను. ఈ దేవస్థానపు వరుంబళ్ళను కొంచమేనియు తాము స్వీకరించుకొనక సంపూర్ణముగా దేవస్థానమునకే ఖర్చుపెట్టుటయే గాక అమూల్యములయిన వస్త్రభూషణ వాహనాదికముల సమర్పించి దేవాలయ ప్రాకార గోపుర మంటపాదుల తమ స్వంత ద్రవ్యముతో నిర్మాణము గావించి శాశ్వతములైన యుత్సవాదులను జరిపించి గ్రామాదుల నొసగిరి.

ఈ దేవస్థానము 1687 మొదలు 1807 వఱకు మహమ్మదీయుల పరిపాలనలో నుండిన కాలములో వారీ దేవస్థానమును పూర్వాచార పద్ధతుల ననుసరించి పరిపాలించుచు దేవస్థాన వరుంబళ్ళను యిజారాల మూలముగా తమ ఖజానాకు తెప్పించుకొనుచుండిరి.

ఈ మధ్యకాలమున దక్షిణ హిందూస్థాన మంతయు యుద్ధరంగముగా నుండినందున శ్రీవారికి హిందూరాజుల కాలమున శాసన మూలముగా నొసగబడిన శాశ్వత ధర్మము లనేకములు లుప్తమై పోలిక తెలియక యున్నవి.

1801 మొదలు 1843 వరకును East India Company వారు పూర్వాచార పద్ధతిగా నీ దేవస్థానములను పరిపాలించుచుండిరి.

మహమ్మదీయుల ప్రభుత్వమునందును కంపెనీ
గవర్నమెంటు ఖజానానుండి హిందూరాజుల
మునకు ద్రవ్యము ఖర్చు చేయబడక పో
ముడుపులు, కానుకలు, ఆర్జిత సేవా
వరుంబడి దినదినాభివృద్ధి గాంచుచునే

అయినను దేశమరాచక స్థితి
జరుగుచుండిన బ్రహ్మోత్సవములె

1843 మొదలు 1933 వఱకు జరుగుచుండిన మహాంతుల పరిపాలన మొదలు దేవస్థాన ద్రవ్యమును మహమ్మదీయ ప్రభువులును కంపెనీవారును తమ ఖజానాకు తీసికొని పోయినట్లు చేయుటకు వీలులేక పోవుటయేగాక దేవస్థాన వరుంబడిలో ప్రతి పైసాకును జవాబుదారులై యుండవలసిన వారయిరి.

ఈ దేవస్థాన ద్రవ్యముయొక్క సద్వినియోగార్థము తేబడిన వ్యవహారముల వలనను మహాజనుల యనవరతమైన యాందోళనము వలనను మదరాసు గవర్న మెంటువారు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల పరిపాలనము చక్కగా జరుపుటకుగాను Madras Act. XIX 1933 (శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల చట్టము) ను శాసించిరి.

క్షేత్రము, తీర్థము, దైవములను త్రివిధ మహిమలయందును అగ్రగణ్యమై వైదికమార్గ ప్రతిష్ఠాపక శ్రీవైఖాన సాగమానుసారి యగు నిఖిల కైంకర్య పూజితమై శిష్టాచారసంపన్నమై పరమ పవిత్రమై కలియుగ వైకుంఠమై వెలుగు నీ దేవస్థానమునకు యాత్రికుల సమర్పించు ద్రవ్యము నైవేద్య ఉత్సవములకును శ్రీవారి భక్తుల సౌకర్యాభివృద్ధికిని వినియోగింప బడవలసినట్లు నియమించి ఆ భారమును తిరుమల తిరుపతి దేవస్థానము కమిటీవారిపై ఈచట్టము మోపియున్నందున ఈ దేవస్థానములకు సంబంధించిన యావద్విషయములను ఈ గ్రంథమూలముగా యాత్రికులకు విశదపరుచుచున్నారు. శ్రీవారి కొఱకంగుటకై యాత్రికులు తీసికొనివచ్చుద్రవ్యము అన్యాక్రాంతము కాక శ్రీవారికే చేర్చవలయుననియు దానికి శ్రీవారి దేవస్థానములో చెల్లించి రశీదు పొందుటయో, లేక శ్రీవారి హుండీలో పడవేయుటయో ఈ రెండు మార్గములే యని హెచ్చరించుచున్నారు.

యాత్రికుల సౌకర్యార్థము శ్రీదేవస్థాన సత్రములలోనే దిగి సుఖముగా దేవస్థానోద్యోగుల సహాయముతో శ్రీవారి దర్శనాదికములను చేసికొని శ్రీవారి యనుగ్రహము పొందవలయునని శ్రీ కమిటీవారు కోరుచున్నారు.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

## BIBLIOGRAPHY.

—(o)—

క్రింద వివరించు గ్రంథములీ పుస్తకము వ్రాయుటకు తోడ్పడినవి :—

1. శ్రీవేంకటాచల మాహాత్మ్యము (సంస్కృతము — తెలుగులిపి)
2. శ్రీవేంకటాచల మాహాత్మ్యము తెనుగు పద్యకావ్యము
—తరిగొండ వెంకమ్మ.
3. The Imperial Gazetteer Vol. V.
4. The "Epigraphical Report" of the Tirumalai Tirupati Devasthanam authorities.
5. The Administration Reports of the Tirumalai Tirupati Devasthanam Committee for F. 1343—1347.
6. The Earlier Edition of "Tirumalai Tirupati Yatra"

